


సచిత్ర మాస పత్రిక

7 A. శివాజీ స్ట్రీట్
టి. నగర్, మద్రాసు-17.
ఫోన్ : 442001

విడి ప్రతి వెల
1 రూపాయి

ఏడాది చందా
పన్నెండు రూపాయలు

సంపుటి 9
అక్టోబరు 1971
సంచిక 10

సంస్థాపకులు :
కీ. శే॥ వి. వి. రాఘవయ్య

మేనేజింగ్ ఎడిటర్ :
శ్రీమతి వి. లీలావతి రాఘవయ్య

Edited and Published by Smt. V. Leelavaty and Printed by Sri B. V. Narasimha Rao at Sri Krishna Chitra Printers, 7, Nageswara Rao Road, Madras-17




ముఖచిత్రం
రామవిజేతా ఫిలింస్
" రామాలయం "

క్రుశ్చేవ్ మరణించాడు.

శాంతిత్రయం నెహ్రూ, కెనెడీ, కృశ్చేవ్‌లలో చివరి శాంతిమూర్తి అశాంతితో మరణించాడు.

తన సేవ, మేలు గుర్తించని తన వారి మధ్యే గుండె జబ్బుతో మృత్యు పోరాటంలో ఓడిపోయాడు. అదే రాజకీయ రంగంలో అయితే అతనికి ఓటమే లేదు — తనపై మోపబడిన ఆరోపణలను ఎదుర్కొనలేక పదవీ విరమణ చేయలేదు. మంచి మనిషికి తన దేశంలో తావు లేదని గుర్తించాడు కనుక పదవీ విరమణ చేశాడు. అది అతనికి రాజకీయంగా ఓటమి కాదు. తన దేశానికి అపకారం చేయదలచి వుంటే ఎన్నో మార్గాలతో రష్యా అంతం చూసేవాడు. అతను దేశభక్తుడు. తన దేశానికి ద్రోహం చేయలేదు.

కానీ, అసహాయతతో మామూలు మనిషి కంటే తక్కువ హోదాలో అనారోగ్యంతో మనుగడ సాగిస్తున్న కృశ్చేవ్‌కు వైద్యరంగంలో దినదినాభివృద్ధి చెందుతున్న రష్యా దేశంలో ఎంతవరకు వైద్య సహాయం లభించి వుంటుంది? అదే జరిగి వుంటే అతని గుండె జబ్బును అరికట్టే మార్గాలే లేవా?

రష్యా అధికారులకు మూడు రోజుల తర్వాత అతనిపై జాలి కలిగిందా మరణ వార్త ప్రపంచానికి తెలియ జేసేందుకు? లేక కృశ్చేవ్ లాటి మేధావి చనిపోయినా మూడు రోజుల తర్వాత బ్రతకవచ్చనే నమ్మకంతో నిర్జీవంగా పడివున్న శవాన్ని మూడు రోజులు కాపలా కాచి, మరణ వార్తను ప్రకటించారా?

దూరపు కొండలు నునుపు; ఇది మనకు పాత సామెత కావచ్చు. మనిషంటే విలువ లేని దేశంతో ఒడంబడికలు చేసుకున్నాము. కొందరు మేధావులు ఆ దేశాన్ని గురించి ఎంతో గొప్పగా చెబుతారు.

ఈ మేధావులు వారి ఆచార వ్యవహారాలను జీర్ణించుకున్నారా? పైపై మెరుగులు చూచి మోసపోయారా?

ఏది నిజం....?

ఏది యేమైనా మనం కూడా వారి ఆచార వ్యవహారాలను అనుసరిస్తే భారత దేశంలోని ప్రతి రాజకీయ నాయకుడి గతి అంతిమ ఘడియల్లో కృశ్చేవ్‌కు పట్టిన గతే అవుతుందేమో!!

అశాంతితో మరణించిన శ్రీ కృశ్చేవ్‌కు ఆత్మశాంతి కలగాలని "జ్యోతి" కార్యాలయం మనః పూర్వకంగా కోరుకుంటూంది

వేల్పూరు రామలింగం




ఆగస్టు మాస పత్రికలో పవని నిర్మల ప్రభావతిగారి "బందోపహతులు" కథ బాగుంది. కథలో చీరాల వాడరేవు, వేట పాలెం జీడిపప్పు, జాంగ్రపేట అద్దకములు యివన్నీ పర్కొనాడంవల్ల ఈ కథతోబాటు నేనూ స్వగ్రామం చీరాల వెళ్ళగలిగాను. అందుకు రచయిత్రికి నా అభివందనములు.

—'ప్రవీణ్‌సుశ్రీ', ఖాజీపేట.

ఎడిటర్‌జీ! సెప్టెంబరు నెల సంచికలో ప్రచురించబడిన యస్. పురుషోత్తమాచార్యగారి "ముసుగు" కథ చాలా బావుంది. నేటి నాగరిక ప్రపంచములో నాగరికత ముసుగులో జరుగుచున్న అన్యాయాల్ని సహజంగా వ్రాశారు. వారికి నా ధన్యవాదాలు. కాని కథ మొదటలో 'కలకత్తా దాకా సుఖంగా ప్రయాణించాలన్న ఉద్దేశ్యంతో సెకండ్ క్లాసు స్లీపరు' టిక్కెట్టు తీసుకున్న విశ్వాసానికి ఆ పెట్టె ద్వారంలో నుంచోవటానికి మాత్రమే చోటు దొరికింది' అని వ్రాశారు. బహుశ యిది తప్పని నా అభిప్రాయము. సెకండ్ క్లాసునకు స్లీపరు కోచ్ వుండదు. సెకండ్ క్లాసు స్లీపరు అని వ్రాసినా—స్లీపరునందు నంబరువారీగా టిక్కెట్లు యిస్తారు తప్పితే ఎక్కువ యివ్వరు. అటువంటప్పుడు విశ్వం గుమ్మంలో నిలబడ్డాడు అన్నది పొరపాటు. తర్వాత సహజత్వానికి దగ్గరగా వున్నది, మ॥కృష్ణమూర్తిగారి ''కాకులు'' సహజంగా వున్నది.

—డి. ఆర్. యస్. సుబ్రహ్మణ్యం,
విజయవాడ-3.

ఎడిటర్‌గార్కి! మామూలుగానే సెప్టెంబర్ సంచికను కూడా చదివాము. నిజము వ్రాయాలంటే యిటీవల 'జ్యోతి' చాలా గొప్పగా వున్నది. సీరియల్సు మంచిగానే వున్నాయి. ''నోరు మెదపని న్యాయము'' నేటి సమాజమునకు తగినదిగానే వున్నది. అలాగే మిగిలిన కథలన్నీ బాగున్నవి. మునుముందు రాబోవు సంచికలలో అనేక క్రొత్త ఆకర్షణలతోను ప్రచురించగలమని మేనేజరుగారు తెలియపరిచినందుకు చాలా సంతోషించుచున్నాము.

—జె. వెంకటేశ్వరరావు, శ్రీమతిసుశీల,
జె. డి. యస్. ప్రసాద్‌బాబు,
ఖైరతాబాద్.

''సూర్యకాంతంగారి జవాబులు'' చాలా సీటుగా, ఘాటుగా చాలా బాగుంటున్నాయి. మీ (మా) జ్యోతిలో కార్టూన్లు కడుపుబ్బ నవ్విస్తున్నాయి!!

—తాడాల రామకృష్ణ, పిఠాపురం.



# దీపావళి ప్రత్యేక సంచిక

## మీ అభిమాన రచయిత(త్రు)లు

యద్దనపూడి సులోచనారాణి, పవని నిర్మలప్రభావతి, ఆచంట శారదాదేవి, బీనాదేవి, కె. రామలక్ష్మి, తురగా జానకీరాణి, డి. కామేశ్వరి, పోల్కంపల్లి శాంతాదేవి, కొడవటిగంటి, ఆరుద్ర, దాశరధి, శ్రీ శ్రీ, నారాయణరెడ్డి, గోపీచంద్, పాలగుమ్మి, గణేష్‌పాత్రో, పురాణం, ఎం. రామకోటి, పర్వతనేని గంగాధరరావు, అభాచంద్, విహారి అండ్ శాలివాహన, శివల జగన్నాధరావు, బొమ్మిరెడ్డిపల్లి సూర్యారావు, ద్విభాష్యం రాజేశ్వరరావు, డి. వెంకట్రామయ్య, యర్రంశెట్టి సాయి, చెలసాని ప్రసాదు, రాజశేఖరరెడ్డి, పి. యస్. రావు రాచనలతో—

1971 దీపావళి ప్రత్యేక సంచిక సర్వాంగ సుందరంగా వెలువడుతూంది. మీ కాపీ నేడే రిజర్వు చేసుకోండి.

విడి ప్రతి వెల రూ 4/-

వివరాలకు

మేనేజర్

"జ్యోతి"

7-ఎ, శివాజిస్ట్రీట్, మద్రాసు-17

# కుమారి వాణిశ్రీ

# సమాధానాలు



ప్రశ్న : వాణిశ్రీగారూ! మీకు ఏయే భాషలు వచ్చు? మీరు హిందీ పిక్చరులలో నటిస్తున్నారా!

జవాబు : తమిళం తెరియుం హింధీ మాలూం. కన్నడ గొత్తు. ఇంగ్లీషు నోస్ తెల్సు!

—తాడాలరాజ సరోజకుమారి,
పిఠాపురం.

ప్ర : అక్కా మీ రింతవరకు ఎన్నో విభిన్నపాత్రలు ధరించారు. అందులో మీకు నచ్చినపాత్ర ఏది? ప్లీజ్ మీ ఫొటో ఒకటి పంపిస్తారా?

జ . మరపురాని కథలో 'రాధ' నాకు నచ్చిన పాత్ర, తప్పకుండా పంపుతాను.

—అజ్జరపు జనార్ధనం,
శ్రీకాకుళం

ప్ర మీ జీవితధ్యేయం ఏమిటి? మీకు ఇంగ్లీషు సాహిత్యంలో ఏ రచయిత అంటే ఇష్టం?

జ : వీలయినంతవరకూ నలుగురికీ సహాయం చేయడమే. సోమర్ సెట్ మామ్ ఫియండ్ నెట్. డాఫెన్ డియోరియరు!

—బి రామారావు,
కాశీబుగ్గ

ప్ర : మీ వయస్సు మరియు మీ యొక్క కులం తెలుపగలరా? మీ మొదటి చిత్రం ఏది? మీరు సినిమారంగమునకు వచ్చుటకు ఎవరు సహాయము చేసినారు? దసరా బుల్లోడు నాకు చాలా నచ్చింది. మిమ్ములను చూడటానికే 3సార్లువెళ్ళాను.

జ : కుమారి వయస్సే. భారతీయులం. భీష్మ? గాడ్! మీరువచ్చినందుకు థేంక్స్.

—ఎస్. కె. రెడ్డి.
బెంగుళూరు

ప్ర : అక్కయ్యగారూ! మీ మొదటి పూర్తి పేరేమిటండీ మీరు హీరోగా ఏ చిత్రంలోనైనా నటించారా'

జ : ఆనం. ఇంకా హీరో అవకాశం రాలేదు తమ్ముడూ! వస్తే తప్పకుండా వెయ్యాలనే వుంది.

ప్ర : వాణిశ్రీగారూ మీకు పద్మ శ్రీ బిరుదులాంటి దేమీ రాలేదు? వస్తే ఏం చేస్తారు? మీకు ఏ దేవుడంటే ఇష్టం' ఎంతవరకు చదివారు?

జ : లేదు, నా పేరులో మరో శ్రీ కలుస్తున్నందుకు సంతోషిస్తాను. దేవు డంటేనే ఇష్టం. మి ప్రశ్నలోనే ఉంది సమాధానం.

ప్ర ; మీరు మేకప్పులో చాలా బాగుం టారు. మరి నిజంగా కూడా అందంగా ఉంటారా? సందేహం తీర్చరూ?

జ :

—జి. విజయలక్ష్మి.
జి. భారతి.
ఆర్. జయలక్ష్మి.
శ్రీశైలం ప్రాజెక్టు

ప్ర : మీరు దసరా బుల్లోడు చిత్రం షూటింగుకు ఇచ్చటికి వచ్చినప్పుడు మీ ఆటోగ్రాఫు తీసుకుందా మనుకున్నాను. కాని వీలుపడలేదు.

ప్లీజ్ సెండ్ మి యు
యువర్ సిగ్నేచర్.

జ : సర్టెయిన్‌లీ.

—పంబు రామం.
అమలాపురం

ప్ర : వాణిశ్రీగారు. కుమారిగా మీకు, మగవారి స్పర్శ (సినీ పరిశ్రమలో) ఒళ్ళు పులకరించి. తన్మయత్వం కలగజేయదా? ఆ నిమిషంలో మీలో ఏఏ కోరికలు చెల రేగుతాయి? ప్లీజ్, మీ చిరునవ్వు లొలికే చిలిపిఫోటో! జవా బివ్వకపోతే మీపైనే ఒట్టు.

జ : హలో బి. యస్‌సి. ఇంతకూ ఈ ఉత్తరం వ్రాసేపుడు మీ ఒళ్ళు పులకరిం చిందా? అర్ధం తెలుసుకోకపోతే మీమీ దొట్టే.

—వి. విజయకుమార్
బాపట్ల

ప్ర : వాణిశ్రీగారు. మీ జీవితంలో మరపురాని సంఘటనా, సినిమా ఏది?

జ : నేను సినిమా నటిని కావడం మరపురాని కథ.

—పరిపాటి వేణుగోపాల్ గుప్త
మదనపల్లె




పట్నం మీంచి పడమరకు జారుకున్నాడు. దినకరుడు సంధ్య చీకట్లో పట్నమంతా క్రొత్త-క్రొత్త అందాల్ని దిద్దుకుంటూ పెరుగుతూన్న నాగరికతతో చేయి గలిపి మత్తుగా-మజాగా తూలుతూంది.

హౌరా బ్రిడ్జి (ఉరఫ్ కుళ్ళు కాలువ) దగ్గర జన సమూహం. పందులు కెలికి వెళ్ళిన కుళ్ళు లోంచి చెలరేగిన దుర్వాసన— రిక్షా వాళ్ళ హడావుడి !....

బండి సైడుకి తోయ్ గురూ—బస్సు లొస్తున్నాయి. కింద పడ్డావో కోర్టు కేసు

కూడా వుండదు. ఆ బస్సోనరు పోలీసాళ్ళ తాలూకా-తాపీగా చుట్ట కాల్చే రిక్షావాడి అదిరింపు.

'ఆ-రావాల సింధియా మలకాపురం యారాడ పార్క్-అయ్య దిగాల అవురా బ్రిడ్జి. చిలకలపేట రైట్ పోనీ గురూ! గుజోక బస్సొస్తోంది. నా సావిఁరంగా పోస్టాఫీసు టిక్కెట్లన్నీ కొత్త రోడ్లో దింపేసి కోసీసేడు దొంగ నాయాల.... అయ్యో అర్సరెళ్ళదు. ఎక్కాలా-క్లీనర్ కుర్రాడు ఒక్క విజిలేసి ఆరు గజాల దూరం బస్సుతో పరుగెట్టి వేలబడ్డాడు.

పూరిగుడిసె ముందు - సెంటు అత్తర్ల వాసన. రెమీ గుబాళింపు. తళుక్ తళుక్ మెరుపు చీర. ఇనపరంగు ఒళ్లు కన్పించే నైలాను జాకెట్టు-లోని కెక్కింది....

రిక్షా మళ్ళీ కదిలింది.

విశాలమైన హార్బర్ రోడ్లలో ప్రశాంతత....చలికి కూలీలు వేసుకున్న రోడ్డు ప్రక్క మంటలు....కడుపు మంటతో చలి మంట ముందు మనుషులు....

రిక్షా ఆగింది సింహద్వారం ముందు. గురా లేడు - బతికించాడు. వెధవ గుర్ఖా వుంటే లోనికొగ్గడు. మామూలు వాచ్

ఇది మరో ప్రపంచం!
కుళ్ళు కనిపించని పవిత్ర స్థలం!!
మరో హిమాలయం!!!

బస్సు దిగిన వారితో కటిక చీకట్లో బ్రోకర్ల సంప్రదింపులు. రిక్షా వాళ్ళ బేరాలు. కోనార్క్ బార్‌లో పాశ్చాత్య వాయిద్య నగ్న గాలి. పూరి గుడిసెల వెనుక కాలువల కంపు. జీవన గంగ. చావు లేనిది - సమాధి లేనిది - గుడిసెల ముందు రెమీ ప్రౌడర్ల వాసన. రామ కోవిల్లో అరిగిపోయిన ఎల్లారీశ్వరి పాట. అందాల తొడల నాట్యతార వాల్ పోష్టర్లు కొనుక్కొనే కుర్రాళ్ళ అల్లర్లు....

రంగడి రిక్షా కదిలింది. కదిలి ఆగింది.

మనే-తొంగి చూశాడు రిక్షాలోకి. గుటక లేస్తూనే ఆపాడు. రిక్షాలోంచి రంగడికి, రంగడి నుంచి వాచ్‌మన్‌కూ సంజ్ఞా ద్వారా పొత్తు కుదిరింది, అర్థాలు తెలిశాయి. ఎవరి పొట్ట కోసం వారు!

రంగడి రిక్షా తేలికైంది. అత్తర్ల వాసన షిప్పులోకి మళ్ళింది. వాచ్‌మన్ తన డ్యూటీ యధావిధిగా నిర్వర్తిస్తున్నాడు.

షిప్పుల్లోంచి. రంగు టదాలలోంచి వెలువడుతున్న కాంతులు. ఓటీ జనం.

ఐరన్ ఓర్‌లో పనిచేసే నిశరాత్రి యనప మనుషులు. అక్కడక్కడ లాంచీల అరుపులు. కూలీల గోల....

అన్నిటి నించీ తప్పించుకుని పారిపోతూంది కాలం....

పారిపోతూ చూసింది-రంగు టద్దాల లోంచి రష్యన్ షిప్పులోకి, ఆఫీసర్ల స్పెషల్ రూంలోకి.

ఖాళీ అయిన ఫారెన్ విస్కీ సీసాలు. పచ్చి మాంసపు ముద్దల్లోంచి బయట పడ్డ ఎముకలు. నల్ల శరీరంతో ఎర్ర శరీరాల క్రీడ. డిమ్ లైట్స్. ఇంగ్లీషు మ్యూజిక్. విస్కీ కంపు. సెంటు కంపు. అత్తర్ల కంపు. కుళ్ళిన పువ్వుల కంపు...

మూర్ఛపోబోయి పరుగెత్తింది కాలం! అర్ధరాత్రి వచ్చింది. సొగ్గా-వల పన్నుతో అందర్నీ మత్తెక్కిస్తూ-నిద్ర మంత్రం వేస్తూ....

లాంచీల అరుపులు సన్నగిల్లాయి. దట్టమైన చీకటి వికృతరూపం ధరిస్తోంది!

షిప్పుల్లో దీపాలు మినుక్ మినుక్ మంటున్నాయి, గోధుమ బస్తాలు ప్రహారీ గోడలు గెంతుతున్నాయి. లారీలు నల్ల బజార్లోకి పరుగెత్తుతున్నాయి. లంచాల మంచం మీది నల్ల కళ్ళద్దాల ఇన్‌స్పెక్టర్ నిద్రలో రంగుల కలలు-లైట్లు లేని నల్ల రంగు కార్ల హడావుడి యాత్రలు....

షిప్పులోంచి బయట పడింది నల్ల శరీరం. నలిగిన మెరుపుల చీర. ఒంటరిగా తూలుతూ-నల్లరాయి ప్రక్క నడక.... రైలు పట్టాలు దాటింది. 'అనుమతి లేనిదే లోనికి రాకూడదు!' బోర్డు దగ్గర పెద్ద వాచ్‌మన్ వికారపు పలకరింపు. గేటు దగ్గర కట్టివేయబడ్డ పదమూడేళ్ళ కుర్రాడూ అతని చేతిలో లంచానికి చాలని పదిపైసల బిళ్ళ. ప్రక్కనో నాలుగు కేజీల గోధుమ మూట! ....చలి మంట దగ్గర పోలీసూ, వాచ్‌మనూ కనుసైగలతో - పలకరింపులతో.

వీధి లైట్లు ఆమెను చూశాయి. నలిగిన ఆమె శరీరాన్ని చూశాయి. చిరిగిన ఆమె రవికను చూశాయి గంట్లు పడ్డ ఆమె జబ్బల్ని చూశాయి. చూసి నిస్సహాయంగా నిట్టూర్పు విడిచాయి.

కాకీ ఫేంటు జేబులు బరువయ్యాయి. రంగడి రిక్షా కదిలింది.

నేవీ క్లబ్బు దగ్గర పోట్లాట. ఆడది పెనుగులాడుతోంది-ఎర్రశరీరపు బాహువుల్లోంచి.

ఎర్ర శరీరం యొక్క ఫేంటు జేబుల్లోంచి తొంగి చూస్తున్న ఇండియన్ కరెన్సీ-ఫారెన్ కరెన్సీ.

ఆ దృశ్యాన్ని చూస్తున్నారు కొంత కొంత మంది.

"ఎదవ లంజ! ఆడి వాచీ ఒట్టుకు పోనాది-మరి ఆదొగ్గుతాడు అంత తొందరగా....

"సచ్చింది—ఎదవ-అంత ఆశేం....



కూలి చేసుకు బతక్కూడదూ?....పై యోళ్ళని పట్టుకు పాకులాడకపోతే!

రంగడి రిక్షాలోంచి బరువైన నిట్టూర్పు!!

హౌరా బ్రిడ్జి దగ్గర సందడి తగ్గలేదు. అది మరో లోకం... మరో ప్రపంచం - మరో హిమాలయం పెరిగిన పాపకూపం! నిత్యం ఆ హిమాలయాన్నధిరోహించేది నీతిమంతులూ, పెద్దమనుషులూ, చీకట్లో మామూళ్ళ వసూళ్ళు, గుడ్డిదీపాల వెలుగులో పళ్ళికిలింపులు, తాగిన బ్రోకర్ కుర్రాళ్ళ కారుకూతలు, పచ్చి సినిమా సంగీతం;!

కిళ్లీకొట్టు పెట్టిన నాగరాజు నెల తిరక్కుండానే విలదొక్కుకోగలిగాడు-అంతా రాత్రి బేరం మరి? ఫేమిలీ ప్లేనింగు మందుల దగ్గరనుండి ఫారెన్ సిగరెట్ల వరకూ అన్నీ అమ్ముతాడు.

రిక్షా ఆగింది.

"ఛాన్సంటే అలాగుండాలి. ఫారెన్ ఛాన్సు....ఒక రాత్రెళితే సాలు-వారం రోజుల కూలి...." చెట్టుకింద బ్రోకర్ కుర్రాళ్ళ పళ్ళికిలింపు.

"ఏటే; తానా రాతిరిదాకా వుండి పోనావ్! ఇదేశాలెల్లి పోనే పోయేవ్! ఎంతిచ్చేడేటి?" తప్ప తాగిన మావ నులకమంచం మీంచి గద్దింపు.

నోట మాట లేదు. కళ్ళలో సుళ్ళు తిరిగిన నీళ్ళు....

"ఏటి? సెప్పవేటి....తే యిలా...." ఇంకా పేలాపన.

సమాధానం లేదు—వెక్కి వెక్కి ఏడ్పు....

"దొంగముండ-మంచి బేరమని కుదిరిస్తే పోయీ కాలం....ఇక్కడుంచే

లంచాలకి పోగా బీడీ ముక్క కన్నా మిగ ల్దని పెద్ద బేరానికి వంపితే - ఏడుస్తుంది-యేడుపు.... సెప్పు-ఎంతిచ్చారాళ్ళు-వందా? యాబయ్యా? తే యిలా-మందు కొనాలి. ఈ పొహిబిసనెత్తేసిన కాడ్నించీ పెతి బేరానికి మందు పొయ్యాల్సొస్తోంది-తే!''

మాఁవ లేచాడు.

యేడ్పు మరింతైంది——

ఆమె మొలలో నలిగిన పది రూపా యల కాగితం అతని హస్తంలోకి జరిగింది.

''యేటీ? పదా! మిగతాదేది? నాటకా లాడతన్నావేటే ఎదవా-'' గద్దింపు.

''లేదు మాఁవా - ఆళ్ళంతా దొరలు. ఎదవనాయల్లు నలుగురు పడ్డారు. ముందు పెట్టిన నోట్లన్నీ నాకే అని ఆవపడ్డా-తెగ తాగేశారు - ఎడవలు. దున్నలు. బాసరాని దుమ్మగిగుళ్ళు. అంతా అయ్యాక నోట్లన్నీ నొల్లుకుంటే తన్ని లాక్కుని పదిచ్చి పంపించారు. నోరు మెదిపేనో లేదో గెంటేశారు షిప్పులోంచి '' మళ్ళీ ఏడుపు.

''లే! లెగు-రత్నంట రతనం. ఎవ డెట్టేదే నీకా పేరు? ఛీ-ఎదవ బతుకు. బతుక్కు తోడు యేడుపు కూడాను. కానీ ఆర్జించనేవు-సేతికిచ్చిన మూటకూడ కాలదన్నుకుంటావ్.'' దున్నపోతులాంటి మనిషి లేచాడు ముందుకి. మత్తుకి లొంగి దొంగ వ్యాపారాలు మరిగి- శరీరాన్ని సోమరితనంతో కుళ్ళబెడుతూ ఆడదాన్ని అడ్డేసుకుని బ్రతుకుతూ.

''ఇక ఒగ్గవాయేటి యేడ్పు. ఎల్లు - ఎటెల్తావో ఎల్లు! ఏ లాడ్జింగు కెల్తావో, ఏ కోనార్కెల్తావో, సినిమాలకే ఎల్తావో నాకు తెల్దు. ముసులాడినే ఒట్టుకుంటావో, టూడెంటునే వల్లో యేత్తావో, బారుసాన్ల కాడ మెంబరౌతావో-నాకు తెల్దు! ఎల్లు! ఎల్లి డబ్బుతే, రెండో ఆట ఒగ్గేలోగా నా మందు బుడ్డికి డబ్బు తేకపోయావో నీ పని సెప్తా-నీ బతుకు సూత్తా- నీ అంతం సూత్తా - యీ పేటలో రేపు పొగద్రెలా రాత్తావో సూత్తా.''

అంత చీకట్లో మాఁవ కండ్లు ఎర్ర బడ్డం రత్నం కంటబడింది. ఇక తప్పదు. తల్చుకుంటే కాళ్ళు గజగజ వణికాయి.

చీకట్లో దబ్‌మన్న చప్పుడు.

---

❋ రైలు చాలా నెమ్మదిగా పోతోంది. అనేకచోట్ల ఆగుతోంది. ఒకచోట చాలా సెపు ఆగింది. ఒక ప్రయాణీకుడు గార్డు దగ్గిరికి వెళ్ళి ''నేను కొన్ని పూలు కోసుకునే వరకూ ఆగుతుందా?''

''పూలా? యీ చుట్టు పక్కల పూలేమీ లేవే!'' అన్నాడు గార్డు.

''లేవు.... ఐతే నా జేబులో విత్తనాలున్నవి!'' అన్నాడు ప్రయాణీకుడు.



టానిక్ ఏదైనా ఆకలిని మాత్రమే పెంచగలిగితే
అది సగం పనిని మాత్రమే చేసినట్లు అవుతుంది

ఇన్‌క్రిమిన్* ఇవ్వండి...
[illegible]
పని చేస్తుంది.

*
ఇన్‌క్రిమిన్ దళంలో చేరండి...
పెరుగుదల నిచ్చు ఆకలి పొందండి!

పెద్ద పిల్లలకు (ఐరన్‌తో కూడిన)
ఇన్‌క్రిమిన్ సిరప్— 175 మి.లీ 57 మి. లీ.
ఇన్‌క్రిమిన్ డ్రాప్స్ పసి బిడ్డలకు 10 మి. లీ.

# *ఇన్‌క్రిమిన్

టానిక్




Lederle

అన్ని మందుల షాపులలో
లభించుచున్నది

• అమెరికన్ సయానమిడ్ కంపెనీ వారి రిజిస్టర్డ్
ట్రేడ్ మార్కు

లింటాస్-INC. 21-500 TL

"గంగులూ!" నాయుడి పిలుపు.

"ఏవులది; యేటా సప్పుడు?"

"గోదూల మూచౌదేశా - డబ్బుతే యిరవయి."

"ఇరవై ఎందుకురా నాయాలా-పదే నేగా. నువ్వు కిరానా కొట్టు సెట్టివై పో తున్నావేటి. వూరికూరికే పెంచేత్తున్నావ్!"

"ఎవురై తేనేటి దర్లు పెంచటానకి! ఆడికేం కొమ్ములున్నయ్యా! నాకు లేవా? పదేయి నా డబ్బిలా. దాందుంపతెగా యియ్యాలా పోలీసోడికేం దక్కాలేదల్లే వుంది నా దగ్గర గుంజాడు. మొన్నైతే పొరుగూర్నుంచి బైస్కోపు సూడ్డానికి సైకిల్ మీద పిలకా గోరింకల్లా వచ్చినాళ్ళ దగ్గర గుంజాడో హస్తం నాయాల-ఇదే పని; అదిసరేగాని నా డబ్బిలాతే-పనుంది."

"ఇంటన్నావా రతనం" గంగులు పళ్ళు పటపటలాడాయి.

"ఎల్లు డబ్బు తెత్తేనే రా." కండలు తిరిగిన బాహువులు రత్నాన్ని బయటకు తోసేసాయి.

"ఏటి గంగులూ మొండితనం. ఒంట్లో బాగాలేదో ఏటో రేపు తెత్తాపిలే."

"నోర్మయ్యిరా నువ్వాగుతావా రేప టొరకూ. పోలీసాడాగుతాడా? ఆ వాచండోర్దువాడు ఆగుతాడా! వచ్చే బేరం మంచి లేకపోతే ఆగుద్దా? ఏటాగేది? వయసున్నప్పుడు సంపాదించకపోతే యింకెంప్పుడు సంపాదిత్తా..."

రత్నం చెవులు గింగురుమన్నాయి కాళ్లు తడబడ్డాయి. వళ్ళు తూలింది. యిన్నాళ్ళకు మున్సిపాలిటీ వారి బల్బులేని పోస్టు యీ విధంగా ఉపయోగపడింది. లేచి నిలదొక్కుకుంది రత్నం.

డబ్బు-డబ్బు-చీకటిలో డబ్బు. చీకట్లో సంపాదన - చీకట్లో లంచాలు - చీకట్లో మంచాలు. లంచాలు డబ్బు రూపంలో రాకపోతే మంచాలే గతి. ఎలాగోలాగ వసూలు ఛీ-నీతీ న్యాయం లేని పశువులు

రత్నం కాళ్ళు ముందుకు సాగాయి.

సంపాదన కోసం సాగాయి. కంకర రాళ్లు కాళ్ళకు కరుకుగా తగుల్తున్నాయి. అరమైలు వరకూ నగానికి త్రవ్వబడ్డ రోడ్డు. వీధి లేని పైపు గొట్టాలు-నిర్జన ప్రదేశంలో ట్యూబ్‌లైట్ల కాంతి.

బార్‌కెదురుగా గవర్నమెంటోళ్ళ సారా దుకాణం. బారుల్లోంచి కారుల్లోకి పోతున్న జనానికి గవర్నమెంటు విషా స్వాగతాలు.

గట్టు మీద కూర్చున్న రత్నానికి బార్ కుర్రాడి పిలుపు-మళ్ళీ కళ్ళలో డిమ్‌లైట్ల కాంతి-సన్నని సంగీతం-మందుల కంపు-మేడపైన చీకటి కొట్లు-క్లాసుకు తగ్గ పరువులు-క్లాసుల వారీ-వ్యక్తుల వారీ-మనసు లేని మానవుల మధ్య తొక్కిడి-డబ్బుకు దొరికే బజారు సుఖం.

నరాల బాధతీర్చుకునే బజారు వ్యక్తులు!

ఛీ! కాపీ. కాపీ....!?

తోంపి



నోట్లు పోగయ్యాయి-చిన్ననుండి పెద్ద వరకూ.

కార్‌లో నిశ్శబ్దం—చీకటి!! కార్ తలుపులగుండా తూలింది రత్నం శరీరం. కీళ్ళలో పట్టులేదు. నరాలలో బలం లేదు. కాళ్ళలో సత్తువ లేదు. బాధగా మూసుకుంటున్న కళ్లు-రెప్పల మధ్యగా జారిన కన్నీటి సూలం.

ఎంత దూరమో! ఎటో నడక.

స్పృహ తప్పిన నడక.

జనసంచారం లేని రోడ్డుమీద మారంగా రెండు దీపాలు పరుగెత్తుకు వస్తున్నాయి తనకోసం! కాదు కాదు-తన శరీరంకోసం. సంఘంలో తను బ్రతుకేది శరీరం అమ్మేగా, తనకుమాత్రం స్వార్థం లేదూ. తప్పు తప్పు - తప్పు కాదు. మాంవకీ. అంచాలకీ డబ్బు కావద్దూ

కారులోని విలాస పురుషుడు క్రిందికి దిగాడు. ఐదడుగుల మారంలో నల్లని స్త్రీ శరీరం. కారు చక్రాలకు ఆహుతైన దేహం-రత్నం శరీరం! కాదు కాదు-బలి పశువు శరీరం!

ఎర్రటి కళ్ళలో ఎక్కడో మెరుపు! భయం. మానవత్వం నశించిన మనిషిలో ఒక దురాలోచన. కారులో ఖాళీ అయిన మందు సీసా రత్నం శరీరం ప్రక్కపడి నిర్జీవంగా నవ్వింది.

ఒచ్చేసింది - అప్పుడే తన దగ్గరకు. ఇటు ప్రక్క అయిదడుగుల లోతు గంత. అంతే!

కారు కీచుమంటూ ఆగింది.

కారులోని ఎర్రకళ్ల క్రిందికి చూశాయి.

అంత చీకట్లోనూ ఎర్రగా కన్పించిన రక్తం - కుళ్ళిన రక్తం. పరుల సుఖం కోసం సమాజానికి ధారపోసిన రక్తం!!!

ఎర్ర కళ్ళూ, గ్లాస్కో లాల్చీ, చేతి కున్న మల్లెపూలూ, చివరకి ప్లిమత్ కారూ అంత చీకట్లోనూ నవ్వాయి. వికృతంగా-అసహ్యంగా. క్షణంలో మంచుదగ్గు ప్లిమత్ కారు పాపంగా కదిలిపోయింది.

కానీ రత్నం శరీరంలో కదలిక లేదు! మొలలో దోపిన నోట్లలోనూ కదలిక లేదు!!

అరగంటలోనే రెండో ఆట జనం మూగారు.

"పాపం ఆడది—ఎదవ నాయాలెవడో ఒళ్ళూపై ఎరక్క కారు తోలాడు...." ఈ కాలంలో పుట్టని ముసలయ్య సానుభూతి.

"ఎదవ లంజ—తాగి లాడ్జీలంబట తిరిగితే ఏటౌతాది? ఎంత పోహిబిసన్ నెత్తేసినా ఆడదిలా రోడ్డంట పడి తాగడమేంటి? కావల్సిందే...." లాడ్జిల సంగతులు అనుభవ పూర్వకంగా తెల్పుకున్న నాయుడు.

"వాట్ హేపెండ్! ఓ! పూర్ ఫెలో!" రిక్షాలోంచి రష్యావాడు!

అందరూ తలొకరాయీ విసిరివెళ్లారు- పరి భయం వారిది!!

"ఉన్నది మనకి వోటు
బ్రతుకు తెరువుకే లోటు—
గాంధీ పుట్టిన దేశమా యిది?"

—ఎవరో బాటసారి పాడుతూ పోతున్నాడు.

చావుల మదుం మీది గజ్జికుక్క ఆకలితో అరిచింది....!

---

కొత్తగా వ్యాపారంలో ప్రవేశించిన కొడుకు తండ్రితో "ఒక ఖాతాదారుడు యీ రడీమేడ్ చొక్కా ఉతుకు పడ్డాక కుంగుతుందా అని అడుగుతున్నాడు" అన్నాడు.

"చొక్కా అతనికి సరిపోయిందా"

"లేదు....వొదులయింది."

"ఐతే ఉతుకు పడ్డాక తప్పకుండా కుంగుతుందని చెప్పు" అన్నాడు తండ్రి.

# రాతి శిఖరాలు

(గత సంచిక తరువాయి)

గోపాలం ఆఫీసులో జాయినయిన తర్వాత నాకు పని వత్తిడి తగ్గిన మాట నిజమే! కానీ బొత్తిగా మనశ్శాంతి లేకుండా పోయింది. గోపాలం పూర్తిగా నన్ను అపరిచితుడిగా, తన పై అధికారిని చూసినట్టు చూస్తున్నాడు. మొదట-మొదట యిది నాకు చాలా కష్టంగా తోచింది. తర్వాత చిర్రెత్తుకు రాసాగి-ది. నాతో కావాలని యిలా దూరం ఏర్పరుచుకుని అతను పొందుతున్న లాభం ఏమిటో అర్థం గాక ఆశ్చర్యం కలగసాగింది.

శాంతి చాలా సార్లు సాయంత్రం వేళల ఏ బజారునుంచో యింటికి వెళుతూ, గోపాలాన్ని తన కారులో తీసుకుపోయేది. సీతా-పిల్లలు ఎలా వున్నారో చూడాలని నా మనసు తహతహ లాడుతున్న మాట నిజమే! కానీ నాలుగు సార్లు అడిగినా, ఆఫీసు విడిచి నా గదిలోకి వచ్చి ఒక్క గుక్క కాఫి తాగి వెళ్ళనిస్తే గోపాలం యింటికి నేనే ముఖం పెట్టుకుని వెళ్తాను! ఒకప్పుడు, గోపాలం కూడా వచ్చి యీ ఆఫీసులో చేరితే బాగుండునని నేను ఎంతగానో ఆశించాను. అతన్ని వత్తిడి చేశాను కూడా! కానీ ఏ కారణం చేతనో గోపాలం ఒప్పుకోలేదు. కానీ నా మాట కాదని తిరస్కరించిన కొద్ది రోజులకే మళ్ళీ వచ్చి యీ ఆఫీసులో చేరాడు. వచ్చినప్పటి నుండి అతని ప్రవర్తన, ముఖంలో రాయి లాటి ఆకఠినత్వం చూస్తున్న కొద్దీ, అతను యీ పనికి మనస్పూర్తిగా రాలేదని, యిందులో శాంతి బలవంతం వుందేమో ననే అనుమానం రాసాగింది. పోనీ అలాటిదేదయినా వుంటే మనసు విప్పి నాతో చెప్పవచ్చుగా! అదీ చేయటం లేదు. ఏదో తప్పు పని చేసి, పశ్చాత్తాపంతో తనని తానే నిర్దయగా శిక్షించుకుంటున్న మౌలిలా వున్నాడతను. ఒకప్పటి ప్రాణ మిత్రులం అయిన మేం యిద్దరం ఒకే చోట 24 గంటలూ పనిచేస్తూ, బొత్తిగా

సీరియల్

అపరిచితుల్లా మసలడం అనేది నాకు నరకయాతనగా వుంది. ఈ బాధ తప్పించు కోటానికి నెలలో చాలా భాగం టూర్ ప్రోగ్రాం కల్పించుకుని, ఊళ్ళో వుండ కుండా పారిపోయే వాడిని.

ఒక్కోసారి కోపం కొద్దీ - గోపాలం మీద కసి తీర్చుకోటానికి అంతకంటే మార్గమేమీ దొరకనట్టు అతని పై అధికారి లాగానే ప్రవర్తించేవాడిని. కానీ తర్వాత తర్వాత యిది యింకో రకంగా నన్ను నేనే వేధించుకోవటం తప్ప అతనికి కించిత్తు బాధ కూడా కలగటం లేదని తెలుసుకుని మానేసాను.

గోపాలం మనసు విప్పి చెప్పటం లేదు కానీ అతనికి-శాంతికి మధ్య ఏదో జరిగింది. శాంతి గుప్పెట్లో అతను చిక్కాడు. అదేమిటో తెలుసుకోటానికి నేను విశ్వప్రయత్నం చేయసాగాను. నాకు తెలిసినంత వరకూ వాళ్ళిద్దరి మధ్యా శారీరకమైన సంబంధమేమీ లేనట్టే తెలు స్తోంది; మరి యిక శాంతి ఏ విషయంలో అతన్ని కట్టి పడేసినట్టు? ఇదే నాకు అర్థం గావటం లేదు.

ఒకసారి గోపాలం కోసం కబురు పంపినట్టుగా అతని యింటికి పంపి సీత-పిల్లల గురించి తెలుసుకున్నాను. సీత-పిల్లలు వూరు వెళ్ళిపోయి రెండు నెలలకి పైగా అయిందని సూర్యం వచ్చి చెప్పగా విని నిర్విణ్ణుడయాను. ఒకప్పుడు, భాగా లేమిటో వున్న స్థితిలో గోపాలం-సీత ఎంత అన్యోన్యంగా వుండేవారో నేను కళ్ళారా చూసాను. గోపాలం సుస్తీ పడి సీత వంట చేసి ఆ యిల్లు గుంభనగా గడి పిన రోజులు గుర్తుకు వచ్చాయి. నేను పేకాడి డబ్బు తెచ్చి యిచ్చి ఆ కుటుం బాన్ని ఆదుకున్న సంఘటన నా కళ్ళ ముందు కదిలింది. అప్పుడెంత ఆత్మీ యంగా, ఎంతో సంతోషంగా వున్నాం. చిన్నగా సాగుతున్న ఆ సంసారంలో అపశ్రుతిలా, అరిష్టంలా శాంతి ప్రవేశించ టానికి నేనే కారణం; నా మూలంగా లేక పోతే శాంతి గోపాలానికి పరిచయం అయేదే కాదు. ఎలా జరిగిందో కాని శాంతి పరిచయంతో, జీవితం పట్ల గోపాలం దృక్పథం సడన్‌గా మారింది. ఈ మార్పు భయంకరమైంది. స్వార్థం కళ్ళకి పొరలు కప్పే యీ దశలో. తన చుట్టూ వున్న వాళ్ళ మనశ్శాంతి నిర్దయగా ఆహుతి కొనే మహర్దశ అది. ఎంతయినా గోపాలం నా మిత్రుడు; అతను పెడదోవ పడుతుంటే హెచ్చరించాల్సిన ధర్మం నాకుంది; హెచ్చరికలతో అతని కళ్ళు తెరుచుకోకపోతే రెండు వాయించి అయినా సరే ఆ సంసారం నిలబెట్టాలి. దురదృష్ట వశాత్తూ సీతకి అన్నదమ్ములు లేరు. తండ్రి వున్నా వృద్ధుడు. అసలు నా అను మానం సీత తలితండ్రుల దగ్గర గోపాలం గురించి వ్యతిరేకంగా ఏమీ చెప్పి వుండ దని....

మర్నాడు గోపాలం ఆఫీసుకి రాగానే నా గదిలోకి రమ్మని కబురు చేసాను.

గోపాలం వచ్చాడు. ఆఫీసు విషయాలు ఒకటి-రెండు మాట్లాడి అతను వెళ్ళి పోతుండగా, "సీత వూరికి వెళ్ళి ఎన్నాళ్ళయింది?" అని అడిగాను.

ఎంత యదాలాపంగా అడగాలన్నా నా కంఠంలో ఆగ్రహం అణుచుకోనటం అసాధ్యమే అయింది.

"రెండు నెలలయింది...." ఆఫీసు లెఖ్కలు వివరాలు చెప్పినట్టే చెప్పేసిన గోపాలం వెళ్ళబోయాడు.

గోపాలం నావైపు తిరిగి చూసాడు. ఆ చూపులో లక్ష అరాలు వున్నాయి. మొట్టమొదట అర్థం "నీకు చెప్పాల్సిన అవసరం నాకు లేదు - అన్నట్టుంది.... రెండోది నా సంసార విషయాలు అడగటానికి నువ్వెవడివి - అన్నట్టుంది .... గోపాలం వెళ్ళి పోబోయాడు.

"గోపాలం!" ఆగ్రహంగా పిల్చాను.

అతను ఆగాడు. కనుక్కున్నాడో ఏమో! రెండడుగులు నా దగ్గరకి వేసి తగ్గు స్వరంలో అన్నాడు. "రవీ! ఒక మాట పది సార్లు చెప్పించుకోవటం వివేక

# యద్దనపూడి సులోచనారాణి

"ఆగు." అన్నాను. అతను ఆగాడు.

నేను టేబిల్ దగ్గరనుంచి అతని దగ్గరగా వచ్చాను.

అతనితో పోట్లాట పెట్టుకోవాలనిగాని, వ్యంగ్యంగా మాట్లాడాలనిగాని నాకు లేనే లేదు.

"సీతను నువ్వు పంపావా? సీత వెళ్ళిపోయిందా?"

సాధ్యమైనంత మామూలుగా అడిగాను.

"తనే వెళ్ళిపోయింది."

"ఎందుకని?"

వంతుల లక్షణం కాదు! నీకు యిదివరకు చెప్పాను. మళ్ళీ యిప్పుడు గుర్తు చేస్తున్నాను. మన మార్గాలు చీలిపోయినాయి."

ఈ మాట వినగానే నా మనసు భగ్గుమంది.

"అంత మాత్రాన మనుష్యులం మారిపోవాలా?"

"మామూలు పరిస్థితుల్లో అవసరం లేదు. కానీ మనకి ఎదురైన పరిస్థితులు వేరు."

"ఏమిటా పరిస్థితులు? నాకేం కనిపించటం లేదే!"

# జరిగిన కథ

డబ్బు పంపడం లేదని మా బాబాయి చాలా కోపంగా ఉత్తరాలు వ్రాసేవాడు. డబ్బు పంపేందుకు ఉద్యోగమే లేదని తెలీదు ఆయనకు. ఓ ఇంటర్వ్యూలో గోపాలంతో పరిచయం ఏర్పడింది. అతని సు స్త్రీ కారణంగా నేను గేటు కీపరుగా వెళ్ళి అనుకోకుండా పాత స్నేహితురాలు శాంతిని చూశాను. ఒక్కసారి మనసంతా ఎలాగో అయిపోయింది,

తర్వాత జ్వాలాముఖిలో చేరి దాని అభివృద్ధికి పాటుపడి, పరిస్థితుల ప్రాబల్యం వల్ల దాని యజమానిని అయ్యాను. శాంతి వాళ్ళ ఫ్యాక్టరీలో మేనేజరుగా చేరమంటే, నిరాకరించి, అది గోపాలాని కిచ్చాను. సుభద్రమ్మ గారు తన మరణించిన కొడుకు పోలికలు నాలో ఉన్నాయని అన్నారు. ఉద్యోగంలో చేరాక అతనిలో వచ్చిన మార్పుకు శాంతి కారణం అని తెలిపి అతనిని హెచ్చరించాను.

పత్రిక పనిపై అనుకోకుండా సత్యను కూడా తీసుకుని భిల్లు జాతుల గ్రామం వెళ్ళి, అక్కడ కోటను చూసి వచ్చాము, కోట దగ్గర వర్షంలో సత్యతో చాలా దగ్గరగా ప్రవర్తించాను. తరువాత నెల రోజులు కనబడక పోతే ఎందుకో తెలీకుండానే చాలా బాధ పడ్డాను. కుసుమ విషయంలో సుభద్రమ్మగారితో చాలా కరకుగా మాట్లాడవలసి వచ్చింది. అక్కడే ఉన్న సత్య ముభావకంగా, అదోలా ప్రవర్తించింది. నా మీద అనుమానంతో సత్య మరో కొత్త ఆక్కౌంటెంటును పంపింది. ఎవరో అని తలెత్తి చూస్తే ఎదురుగా భారంగా గోపాలం!!!

---

"అది నీ దృష్టి లోపం. ఒక్క మాట చెప్పు? నాకు నచ్చలేదని అంటే యీ పత్రిక, యీ ఆఫీసు, యీ వాతావరణం వదిలి వెళ్ళిపోగలవా నువ్వు?"

"వెళ్ళిపోగలను! నేనిక్కడ యీ ఉద్యోగం చేయటంవల్ల నిన్ను అమితంగా బాధించేది ఏదయినా వుంటే తప్పక వెళ్ళిపోతాను."

"ఐతే వెళ్ళిపో-తక్షణం....ఊఁ!"

"నేను యిక్కడ వుండటంవల్ల నిన్ను బాధించే విషయం ఏమిటో చెప్పు మరి?"

"ఒకటా? లక్ష వున్నాయి! ఈ పత్రిక అధికారం నాకు వస్తుంది! నాకు హోదా పెరుగుతుంది. ముఖ్యంగా శాంతికి, నాకూ అడ్డు తొలగుతుంది."

"గోపాలం!" వెర్రివాడిలా చూడ సాగాను,



''నువ్వు నవ్వినా సరే! శాంతికి-నాకూ మధ్య నువ్వొక పెద్ద అడ్డు. శాంతి అంధు రాలిలా నీవైపు అర్రులు జాస్తోంది. నీ దృష్టి రవంత కూడా శాంతి మీద లేదని, ఎప్పటికీ మళ్ళదని కూడా నాకు తెలుసు! శాంతికి కనువిప్పు కలిగేవరకూ ఎదురు చూడటం మినహా నాకింకే గత్యంతరం లేదు. ఒక విధంగా శాంతి గుడ్డిగా నిన్ను ఆరాధిస్తుంటే, యింకో రకంగా రెట్టించి గుడ్డితనంతో శాంతిని నేను కోరుకుంటు న్నాను. నా ముఖంలోకి వెచ్చటి ఆవిరి ఒక్కసారి పొంగులా వచ్చింది. చటు క్కున ఒక అడుగు ముందుకు వేసి గోపాలం నోటిని నా చేత్తో గట్టిగా మూసే సాను.

''గోపాలం! చాలు! ఇంక మాట్లాడకు!

ఇంకెప్పుడూ యిలాటి మాటలు పొర బాటుగా కూడా నా దగ్గర ఎత్తకు। ఈ రోజు మన స్నేహంలోని ఏ పవిత్రతకో నేను నీ గొంతు పిసికకుండా, నీ రక్తం కళ్ళ చూడకుండా ఆపింది... గోపాలం। నువ్వు పెళ్ళి అయిన వాడివి। శాంత పెళ్ళి అయిన స్త్రీ। ఈ కళ్ళ కావరం నీకెలా వచ్చింది। ఎందుకు వచ్చిందో నాకర్థం గావటం లేదు।'' గోపాలం నా చేయి విసురుగా తోసేసాడు.

"మనసులో ఒకటి పెట్టుకుని, పైకి యింకోటి మాట్లాడటం నాకు రాదు రవీ। నా తత్వం మొదటి నుంచీ యింతేనని నీకు తెలుసు. భవిష్యత్తులో ముందు-ముందు యిలా శాంతి అనే అమ్మాయి నా జీవితంలోకి ప్రవేశిస్తుందని తెలిస్తే నేను సీత నీడని కూడా చూసేవాడిని కాదు. సీత మీద మనసు లేకుండా, ఉన్నట్టు నటించటం అది యింకెంత ద్రోహమో నీకు తెలుసు। అందుకే సీతని పుట్టింటికి పంపేసాను. దానివల్ల సీతకి, నాకు చాలా బాధ తప్పింది. నేను నీకు దూరంగా ఎందుకు వుంటున్నానో తెలుసా? ఇప్పటికైనా అర్థం అయిందా? నువ్వు నాకు మిత్రుడిగా వుంటే యివన్నీ వినక తప్పదు. వినిపించానంటే నువ్వు భరించ లేవు. ఇవన్నీ చెప్పకుండా నీతో నేను స్నేహంగా వుండలేను. అది కేవలం నటన అవుతుందే తప్ప స్నేహం కాదు. ఇప్పటికైనా నువ్వు నన్ను అర్థం చేసుకుంటే నేను కృతజ్ఞుడిని।''

ఎలాటి తడబాటూ లేకుండా నిశ్చలంగా అనేసిన గోపాలం వెళ్ళిపోయాడు.

నేను చాలా సేపు శిలాప్రతిమలా అక్కడే నిలబడి పోయాను। గోపాలం చెప్పిందంతా అక్షరాలా నిజమే కావచ్చు। కానీ నేను భరించలేకుండా వున్నాను. అతని ధైర్యాన్ని నేను ప్రశంసించలేక పోతున్నాను భవిష్యత్తులో శాంత అనే అమ్మాయి వస్తుందని తెలిస్తే సీత నీడ కూడా చూసేవారు లేరుట। ఇదే అనుభవం సీతకి ఎదురైతే? సీత యింకో వ్యక్తిని చూసి గోపాలాన్ని యిలా తృణీకరిస్తే? నిజమేలే అని తొలిగిపో గలుగుతారా? మనిషికి ఆలంబన అనేది అవసరం కాదా? తెగిన గాలిపటంలా ఎప్పుడు-ఎక్కడ వారికి అదే ఆశ్రయమా? గోపాలానికి శాంతి పట్ల అనురాగం ఏర్పడటం నేరం అని నేను అనుకోను। దోషంగా కూడా భావించను. కానీ తన బలహీనతకి, తన స్వార్థానికి అన్నెం పున్నెం ఎరగని యింకొకరిని బలి చేయటం ఏం న్యాయం? నేను నటించలేను అనే ఒక్క మాటతో సీతని దూరంగా పంపేసి చేతులు దులుపుకున్నాడు. యదార్థవాదినని వెన్ను విరుచుకుంటున్న యిలాటి వాళ్ళు వాస్తవానికి ఒట్టి స్వార్థపరులు। ఇంతకంటే హీనం యింకేదీ లేదు.

(సశేషం)

"ఏమండీ.... మీరెవరో తెలుగు వారులా ఉన్నారు.... రెండు రోజులనుండి చూస్తున్నాను...."

"అవును బాబు.... మీరో?"

"నేనూ.... తెలుగు వాడ్నే నండీ.... కృష్ణా జిల్లా.... నా పేరు మూర్తి.... ఏమైనా పని మీద వచ్చారా!...."

"అవును నాయనా.... పని మీదే వచ్చాం.... మేం చిత్తూరు వాళ్ళం.... నా పేరు శివకామయ్య. ఆ అమ్మాయి.... మాఅమ్మాయి-నళిని.... ఒక్కగా నొక్క కూతురు...."

"మీరు.. ఏదో బాధ పడుతున్నట్టు న్నారు. .. నేనేదైనా సహాయం చేయగల ననుకుంటే చెప్పండి నా శక్తి కొలది ప్రయత్నిస్తాను.. ."

"ఎవరు చేసేదేముంది బాబు ంతా నా కర్మ ..దాని దురదృష్టం "

"ఏమండీ.... అన్నీ తెలిసిన మీరే ఇలా నిరుత్సాహంగా మాట్లాడితే . పాపం.... మీ అమ్మాయి .. "

"గది నెంబరు పదిలో ఉన్న రావు...."

"అమెరికానుండి వచ్చినతనే గదండీ!...."

"అవును.... మీకు తెలుసా బాబు...."

"లేదండీ.... నేను పేరు చూశాను.... అంతే...."

"అతడు నా మేనల్లుడు.... అతడు.... అయిదు, ఆరు, సంవత్సరాల వయస్సులో ఉన్నప్పుడే.... నాచెల్లెలు.... అంటే అతగాడి అమ్మ.... చనిపోయింది.... అప్పుల వాళ్ళ బాధ... సంసారపు గొడవలూ . భరించలేక, అతగాడి బాబు దేశాల వెంట పోయాడు ... అప్పటికీ .. యిప్ప టికీ .. జంతు లేదు. బ్రతికున్నాడో— చచ్చాడో కూడ తెలియదు . ఎవరైనా ఎక్కడైనా చూసినట్టుగా పుకార్లు కూడ లేవు... "

"ఎందుకు నాన్నా యిప్పుడు ఆ గొడవంతా ..."

"చెప్పనీయండి . హృదయంలోని బరువు తగ్గుతుంది పాపం ..ఆయన ఎంతగా బాధ పడుతున్నారో . "

"నిజం చెప్పావు బాబు. ..అవురుమని ఏడిస్తే హృదయం తేలిక పడుతుం దంటారు.... ఇరవై సంవత్సరాలు అవు తుంది యిప్పటికి. దిక్కులేని వీడ్ని చేర దీసి పెంచి పెద్దవాడ్ని చేశాం. చదువు చెప్పించాం. ఏ లోకంలో ఉందోగాని.... మా ఆవిడకి వీడంటే ఎంతో ప్రేమ కన్నబిడ్డ కన్నా ఎక్కువగా చూసుకుంది.

"మన అబ్బాయి అయితే చదివించే వాళ్ళం గాదూ?...." అంటూ చదివించాలని పట్టు పట్టింది. అప్పులుకూడ చేయించింది వాడి చదువు కోసం. వాడు అమెరికా వెళ్ళే టప్పుడు ఆయిన ఖర్చుకు, ఒక ఎకరం పొలం అమ్మి కట్టవలసి వచ్చింది. ఆ తరువాత వాడూ ఏదో కొద్దిగా పంపాడను కోండి....వాడ్ని చూడాలనీ, వీళ్ళిద్దరకూ పెళ్ళి చేసి అచ్చటా ముచ్చటా తీర్చుకోవా లనీ ఎంతో ఆశ పడింది. వాడి కోసం కలవరిస్తూనే, మమ్మలను విడిచి వెళ్ళి

అప్పుడు వెంటనే వాడి వెంట వెళ్ళటానికి వీలుపడదన్నారు. వాడు చెప్పింది సబబు గానే ఉందనుకున్నాం. వాడు చెప్పినట్టు గానే చదివించాం. వాళ్ళిద్దరూ ఉత్తరాలు రాసుకుంటూనే ఉండేవారు. అక్కడ చదువు పూర్తి అయిన తర్వాత అక్కడే ఉద్యోగంలో చేరి, వచ్చి పెళ్ళి చేసుకొని తననికూడ అక్కడికే తీసుకుని వెళతానని రాస్తూ ఉండేవాడట. చదువుకుంటే అది అక్కడకు వెళ్ళిన తరువాత యింకా చదువుకోవచ్చుననీ, ఉద్యోగంకూడ చేయ

---

మనిషి ఆశించినట్లు అన్నీ సవ్యంగా జరిగితే

జీవితానికి అర్థమేవుండదేమో?!

---

పోయింది....దానికి జబ్బుగా ఉందనీ, డాక్టర్లు నమ్మకం లేదంటున్నారనీ, మనో వ్యాధి అని చెబుతున్నారనీ, ఒక్కసారి వచ్చి చూసి వెళ్ళమనీ, వచ్చి వెళ్ళటానికి డబ్బు నేనే యిస్తాననీ ఎన్నో ఉత్తరాలు రాయించాను. కనీసం జవాబుకూడ రాయ లేదు. ఎంతగా మారిపోయాడో!...."

"అమెరికా వెళ్ళే ముందే పెళ్ళి చేసు కుని వెళ్ళమన్నాం. తిరిగి వచ్చిన తరువాత చేసుకుంటాను చదివించమన్నాడు. పెళ్ళి అయిన తరువాత వాడు అక్కడా యిది యిక్కడా ఉంటే ఏమి బాగుంటుంది?....

వచ్చుననీ, బాగా చదువమనీ....అక్కడి వింతలూ, విశేషాలతో ఎంతో ముచ్చటగా రాస్తూ ఉండేవాడు. అవి చూసుకొని అది ఎంతగానో మురిసిపోతూ ఉండేది. ఎన్నో ఆశలు పెట్టుకుంది, ఎన్నో సంబంధాలు వచ్చాయి. మేనరికం ఉంది కాదన్నాం. వీళ్ళిద్దరకూ వివాహం ఖాయమైందనీ, ఆ తరువాత, అమ్మాయికూడ అమెరికా వెళ్ళటం సంగతి అందరకూ తెలిసి పోయింది. కాని....కాని ...ప్చ్....ఏమి చెప్పమంటావ్ బాబు, భగవంతుడు మా రాత మరొక రకంగా రాసాడు....దాదాపు

సంవత్సరం అయ్యింది ఉత్తరం వచ్చి. ఎన్ని ఉత్తరాలు రాసినా జవాబే లేదు.... నలుగురూ నాలుగు రకాలుగా చెప్పుకుంటు న్నారు ...అక్కడి విషయాలను కొన్నిం టిని వింతగా, విడ్డూరంగా మా ఆవిడికి కూడ చెప్పారు. దానితో అది మంచం పట్టింది. "అప్పుడే పెళ్ళి చేసి ఏదొక రకంగా, యిద్దర్నీ పంపించి ఉంటే, బాగుండేది ..." అంటూనే మనోవ్యాధితో ఆరు నెలలనాడు దాటిపోయింది."

"అక్కడ ఎవరినో పెళ్ళి చేసుకొని ఉంటాడని...." ఎన్ని చెప్పినా, యీ పిల్ల నమ్మకుండా ఉంది. పెళ్ళీడుకొచ్చిన ఆడపిల్ల....మంచికీ - చెడుకూ యింట్లో ఆడదిక్కు లేదు. ఈ బాధలో యీ పిల్ల ఏమవుతుందోననే భయం....ఏమి చెప్పను బాబు....బ్రతకలేక - చావలేక బ్రతుకు తున్నా....పెళ్ళి చేసుకోమని ఎంతగానో చెబుతున్నా....ససేమిరా వద్దంటుంది. అదేమంటే, . పెళ్ళే చేసుకోనంటుంది.... ఏదొక ఉద్యోగంలో చేరి, బ్రతుకుతా నంటుంది. ముందు సంగతికూడ ఆలో చించుకోవాలి బాబు ...నీవే చెప్పు—ఆడది వంటరిగా బ్రతకటమా? ఏ వయస్సుకు తగ్గట్టు ఆ కోరికలు ఉంటవి గదా!.... ఒక్కగా నొక్క కూతురు! లేక-లేక పుట్టింది. ఎంతో ప్రేమతో పెంచాం.... ఎన్నో కోరికలూ-ముచ్చటలూ తీర్చుకోవా లనుకున్నాం....దాని దోవ అది చూసు కుంది .... అదృష్టవంతురాలు .... చూస్తూ....చూస్తూ....నేను నా బిడ్డను ఎలా దాని యిష్టానికి వదలివేయగలను. నీవే చెప్పు బాబు .... నలుగురూ, నా

---

● ఒక తాగుబోతు రెండు బొటన వ్రేళ్ళనూ ఒక్కో కన్ను మూస్తూ తీవ్రంగా చూస్తున్నాడు.

"ఏమిటి ఆ వ్రేళ్ళ మధ్య?" అన్నాడు మరో తాగుబోతు.

"కనుక్కో...."

"సీతాకోక చిలుకా?"

"ఉహుఁ."

"గుర్రమా?"

"ఉహుఁ."

"ఏనుగా"'

"ఏ రంగుదంటావు?" అని అడిగాడు మొదటి తాగుబోతు.




"షూ పట్టకపోతే, వేరే పెద్ద సైజు ట్రై చెయ్యి...!"

నోటిలో ఉయ్యరూ....ఊళ్లో తల ఎత్తు కొని తిరుగగలనా?...."

"ఇంతలో వారంరోజుల నాడు ఇత గాడు వస్తున్నాడనీ....పది రోజులు యీ హోటల్లో పదవ నెంబరు గదిలో ఉంటా డనీ .కలుసుకో దలచినవాళ్ళు కలుసుకో వచ్చుననీ పేపరులో పడింది .... మరల ఆశ కిలిగింది....కనిపించి, ముఖాముఖీగా మాట్లాడితే ఎదొకటి తేలిపోతుందనీ నేను అనుకున్నాను....తనను చూడగనే తప్పక మరల తన మార్గంలోకి వస్తాడనీ దాని ఆశ. వచ్చాం.... కొండంత ఆశతో వచ్చాం బాబు....కలుసుకొన్నాం, ఏదో యింగ్లీషులో మాట్లాడతాడు. నేను ఏదైనా తెలుగులో అడిగితే నాకు సమా ధానమే చెప్పడు. అదికూడ యింగ్లీషు లోనే మాట్లాడింది. ఏమీ ఎరగనట్టుగా తెలియనట్టుగా అదొక రకంగా సమా ధానాలు యిచ్చాడట. ఈ రోజు కూడా ప్రయత్నించాం. నేను వెళ్ళకుండా దాన్ని మాత్రమే పంపించాను. కాళ్ళా, వేళ్ళా పడి ప్రాధేయపడిందట. కాని ఏమేమో మాట్లాడాడట. తెలియనట్టుగా ... కొత్త వాళ్ళతో....మాట్లాడినట్టుగానే మాట్లాడా డట. ఇన్ని సంవత్సరాల స్నేహాన్నికూడ ఎలా మర్చిపోగలిగాడో! .... నేను అటు

వెళ్ళి చుట్ట కాల్చుకొస్తాను. మా అమ్మాయికి చెప్పిచూడు నాయన....నా మాటలు ఏమీ దానితల కెక్కటం లేదు. నీ మాట అయినా వింటుందేమో....''

*　　*　　*

"ఏమమ్మా....చదువుకున్న దానివి.... మీరే ఆలా దిగులుపడితే ఎలా?....మీ నాన్నగార్ని చూడండి. ఎలా కుమిలిపోతున్నారో ...పాపం, యీ వయస్సులో ఆయనకు ఎంతకష్టం!....ఆ మూగబాధ ....ఆయనకూ, భగవంతునికే తెలియాలి ...మీరు కొంచం ధైర్యంగా ఉంటే ఆయన మనస్సు కొంచం ప్రశాంతంగా ఉంటుంది....రావ్ ఏమన్నాడు? ....మీ అన్నలాంటివాణ్ని ..నే నేదైనా చేయ గలనేమో!....''

''ఎవరు చేయగలిగింది మట్టుకు ఏముంది?....అంతా నా దురదృష్టం....ఎవరినని ఏమి లాభం? ఆయని నన్ను ఏమీ ఎరుగనట్టగానే మాట్లాడుతున్నారు. మేము యిద్దరం చిన్నప్పుడు ఎలా ఆడుకుంటూ ఉండేవాళ్ళమో... తరువాత ... తరువాత భవిష్యత్తుని గురించి ఎలా కలలుగంటూ ఉండేవాళ్ళమో....ఎలాంటి ఆశాసౌధాలు నిర్మించుకున్నామో ...అన్నీ సిగ్గు విడిచి కన్నీరు మున్నీరుగా ఏడుస్తూ చెప్పాను. కాని ఫలితం శూన్యం. ఒక కథను విన్నట్టుగా విన్నారు. అదే అన్నారుకూడాను. "Wonderfull story...Wonderfull sequences...You must be a master storyteller'' అన్నారు. మరల ఎంతో జాలిగా "పాపం .... నిన్నెవరో మోసపుచ్చారు.... నేను మట్టుకు ఆవ్యక్తిని గాదు, మీరు పొరపడ్డారు. నేను ఒకరిని మోసపుచ్చలేను. మీ అంత అందమైన ఆడపిల్లను మరిచిపోగలవాడు....ఒట్టి మూర్ఖుడంటాను. వాడిబుర్ర చెడిపోతే గాని అలా చేయడు....నేనా?....అబ్బే ఎవరినీ యింతవరకు ప్రేమించలేదు. ప్రేమించను కూడాను....అలాంటి పిచ్చి పిచ్చిపనులు నేను చేయలేదు. చేయనని కూడ ఖచ్చితంగా చెప్పగలను.... అనవసరంగా మీరు బాధపడుతూ. నన్నుకూడ బాధపెట్టకండి .... మిమ్ములను చూస్తే మోసంచేసి....అదొక బిజినెస్‌గా బ్రతికే వారని అనిపించటం లేదు. అందువల్లనే హోటల్ అధికార్లకు కంప్లయింట్ ఇచ్చి మిమ్ములను అల్లరిపెట్టటం నాకు యిష్టం లేదు...,నేను విశ్రాంతికోసమని ఇక్కడకు వచ్చాను. మీరు తక్షణం యిక్కడ నుండి వెళ్ళిపోండి...." అని అన్నారు. నన్ను ఇంకేమి సమాధానం చెప్ప మంటారు? ఆయన రాసిన ఉత్తరాలుకూడ చూపించాను. అన్నింటికీ ఆయన సమాధానం ఒక్కటే.

"మీరు కావాలనుకుంటే .... నేను మిమ్ములను మోస పుచ్చాననుకుంటే.... పోలీసులకు కంప్లయింటు చేయండి ... వెళ్ళండి....తక్షణం రూమునుండి బయ

టకు వెళ్లండి,...'' అన్నారు ఎంతో విసు కుగా, కఠినంగాను...."

''ఆయన నిజానికి అలాంటి కఠిన హృదయులు గాదు. చాలా సున్నితమైన మనస్సు....పసివాని కన్నా కనాకష్టం. అలాంటి....ఆయన....తన ప్రాణంకన్నా ఎక్కువగా నన్ను....ఆయన ఈ నాడు అలా అంటున్నారు. దీని అంతటకూ బలవత్తరమయిన కారణం ఏదో ఉండి ఉండాలి. ఆయన ఎవరో అతి హీనంగా కష్టపెట్టిఉండిఉండాలి. దానివల్లగానీ. మరేదైనా కారణంవల్ల గానీ .... షాక్‌వల్ల ఆయన బ్రెయిన్ చెడిపోయి ఉంటుంది. అలాంటిది ఏదో జరిగివుండకపోతే, ఆయన అలా మారిపోయి ఉండరు. ఆయన నాకు తెలిసినట్టుగా మరెవరికీ తెలియదు, దాదాపు యిరవై సంవత్సరాల నుండి పెరిగి పెద్దదయినది మా స్నేహలత. దాన్ని అపురూపంగా పెంచుకున్నాం .. ఒకరిని విడచి ఒకరం ఉండేవాళ్ళం గాదు....చంద్రుడూ. వెన్నెలలా కలసి మెలసి కాలం గడిపాం దాని పర్యవసానం....ఆయన నన్ను ఎరుగనే ఎరుగనంటున్నారు. నే గుర్తుతే ప్రయత్నించిన గతం. మా బంగారు కలలు....అంతా అబద్ధం....అదేమీ తనకు తెలియనేతెలియదంటున్నారు... కారణం ఏమిటంటారు? ఆయన తప్పు ఏమీలేదు....గతాన్ని మర్చిపోవటానికి ఆయన యిలా నాటకమాడుతున్నారంటే నా ప్రాణం ఉండగా నేను నమ్మలేను. ఆయన అలాంటి మనిషి గాదు అవి అన్నీ అన్నది ఆయన గాదు. ఆయన అనేది ఏమిటో ఆయనకే తెలియదు....అమెరికాలో ఏదో జరిగిఉంటుంది.ఆయన నాకు కాకుండా పోయారు. నాకు కావలసింది ఆయన సుఖం. ఆయన ప్రశాంతంగా బ్రతకాలి.ఆయన మామూలు మనిషిగా మారాలి....ఎలా సాధ్యం?.... ఏంచేయాలి?...మా కో మార్గం చూపండి ....డాక్టర్లకు చూపెట్టితే!...,మీరు చెబితే వింటారేమో పరిచయం అంతగా లేకపోయినా, మీ మంచితనాన్ని ఆసరాగా తీసుకొని ...యిలాంటి కోరికను కోరుతున్నందుకు మన్నించండి ..,దిక్కులేవి మాకు.... అంతా అయోమయంగాఉంది. మేం ఏం పాపంచేశామని మా కీ శిక్ష!''

''అమ్మా...మీ బాధను నేను అర్థం చేసుకోగలను....మీ ఇద్దరిమధ్య ప్రేమను గురించి కూడ నాకు తెలుసు. మీరు యీ మధ్య రావ్‌కి రాసిన ఉత్తరాలు కూడ చూశాను...,మీకు యిది అంతా ఆశ్చర్యంగా ఉంది గదూ!,...నేనూ, రావూ ప్రక్క ప్రక్కనేఉన్న యూనివర్శిటీలలో చదువుతున్నాం. మేము యిద్దరం ఒకే సబ్జక్టు వాళ్ళం అవడంవల్ల. ఒకసారి ఆ సబ్జక్టు మీద జరిగిన సమావేశంలో మా

---

సామర్థ్యమే పేదవాడి ధనం!

—మాథ్యూ ఆర్నాల్డ్

---

యూనివర్శిటీలో కలుసుకున్నాం..'తెలుగు వాళ్లం....అందులో మా యిద్దరి సబ్జక్టులూ కూడ ఒకటే అవటంవల్ల, యిద్దరకూ పరిచయంఅయింది. అప్పుడప్పుడు ఉత్తరాలు రాసుకొంటూ ఉండేవాళ్ళం... రావ్ చాలా మంచివాడు. అతని ప్రొఫెసర్‌కు కూడ రావు అంటే చాలా అభిమానం. తెలివిగల విద్యార్థిగా అక్కడ మంచిపేరు సంపాదించుకొన్నాడు.'.

"అంత మంచివాళ్ళకుకూడ కష్టాలు వస్తాయి గావును...సడన్‌గా ఆయనకు జబ్బుచేసింది....అన్ని పరీక్షలూ చేశారు. అతని Heart trouble వల్లనే ఆ వ్యాధి అనీ హార్టుకూడ చాలా దెబ్బ తిన్నదనీ, డాక్టరు అన్నారు. అతడి హార్టును తీసి దాని స్థానే మరొక హార్టును పెట్టాలనీ.... దానిలో వారు కృతకృత్యు లయితేనే రావు జీవించటానికి అవకాశం వుంటుందనీ,....లేనిచో ఆయన ఎప్పుడైనా దాటిపోవచ్చుననీ కూడ డాక్టర్లు చెప్పారుట .. అప్పుడు రావ్ నన్ను వెంటనే ఒకసారి వచ్చివెళ్ళమని ఉత్తరం రాశాడు.ఎందుకోనని వెళ్ళితే పై విషయాలన్నీ తెలిసినాయి....తనకు గనక ఏదైనా ప్రమాదం జరిగితే మీకు మట్టుకు తెలియపర్చమన్నాడు. అప్పటివరకూ ఏవరికీ తెలియనీయ వద్దని, నా నుండి మాట తీసుకున్నాడు. దానినిబట్టే మీ దావగారి హృదయంలో మీకు ఎలాంటి స్థాన ముందో తెలుసుకో గలిగాను."

"కారు ప్రమాదంలో చావటానికి సిద్ధంగా ఉన్న ఒక అమెరికన్ యువకుని హృదయాన్ని రావు హృదయస్థానే పెట్టారు. డాక్టర్లు వాళ్ళ ప్రయత్నంలో చాలా కృతకృత్యులయ్యారు. ప్రపంచ ఖ్యాతిని పొందారు. వైద్య చరిత్రలో నూతన అధ్యాయం ప్రారంభమయిందన్నారు విజ్ఞులు. ..ఇంకా రావు ట్రీట్‌మెంట్ పొందుతూనే ఉన్నాడు. ఆరోగ్యాన్ని కోలుకొంటున్నాడు... కాని. .. ఆయన ప్రవర్తనలో విపరీతమైన మార్పు డాక్టర్లకు కన్పించింది. రావ్‌ను.... కొంచంగానైనా ... తెలుసుకున్న మా అందరకూ ఆయన ప్రవర్తనలో మార్పు ఎంతో ఆశ్చర్యాన్ని కలిగించింది.ఇప్పుడు కూడ.... రావ్ ... ఆయనకూ నాకూ యింతకుముందు పరిచయం లేనట్టుగా ప్రవర్తించుతాడు .. , హార్టుకూ, బ్రెయిన్‌కూ సంబంధం ఉందనీ, హార్టును మార్చటంవల్ల బ్రెయిన్‌లో కూడ మార్పులు రావడానికి చాలా అవకాశాలు ఉన్నవనీ విజ్ఞానవేత్తలు కనిపెట్టారు.... కాని వాళ్ళ పరిశోధనల ద్వారా యింత మార్పు....రావ్‌లో వచ్చినంత మార్పు రావటానికి అవకాశం వుంటుందని వారు కనుగొనలేదు. యింతటి మార్పుకు అవకాశం వుండవచ్చునని కూడ వారు ఊహించలేకపోయారు. మొదటిసారిగా రావ్ కేసు వారికి ఒక నూతన అవకాశాన్ని యిచ్చింది. ఒక నూతన సిద్ధాంతాన్ని కనిపెట్టటానికీ, యిదివరకటి ప్రయోగాలూ,



సిద్ధాంతాలూ అన్నీ తప్పు అని చెప్పటానికి యిప్పుడు వాళ్ళకు అవకాశం దొరికింది''

''మరికొన్ని నూతన విషయాలు తెలుసుకోటానికి....రావ్....తన బంధువులనూ, దీనికి పూర్వం లాగా తెలిసిఉన్న మనుష్యులను కలుసుకోవటంతో పూర్వపు సంఘటనలు గుర్తురావటంవల్ల,....మరల రావ్‌లో ఏమయినా మార్పు వస్తుందా? ఆయన అసలు యిదివరకు పరిచయమున్నవారిని గుర్తిస్తారా? .... మార్పు వస్తే ఎంతవరకు మార్పు వస్తుంది?.... ఇక్కడ ఆయన ప్రవర్తన....పరిచయమున్న వ్యక్తులు కలిపినప్పుడు .. ఎలా ఉంటుంది?... మొదలగు విషయాలు తెలుసుకోటానికి రావ్‌ను యిక్కడకు పంపించారు. రావ్ నాకు తెలియటం వల్లనూ, నేనూ తెలుగువాడనవటం వల్లనూ,...ఆయనతో కూడ నన్ను పంపించారు. ఈ మధ్య మీరు రావ్‌కు వ్రాసిన ఉత్తరాలు అతడు చదవనే లేదు. అవి అన్నీ అతడి రూములో ఓపెన్ చేయకుండానే పడిఉన్నాయి.

ఆ ఉత్తరాలు వల్లనే, విజ్ఞాన వేత్తలకూ, శరీర శాస్త్రవేత్తలకూ, మన శాస్త్రవేత్తలకూ, మీరు, రావూ.... ఒకరిని ఒకరు ఎలా ప్రేమించుకున్నారో తెలుసు. అందువల్లనే వారందరూ కలసి, యీ ఏర్పాటు చేశారు. మిమ్మలను కలుసుకున్నప్పుడు రావ్ ఎలా ప్రవర్తించుతాడో అనేది వాళ్ళ పరిశోధనలకు ఎంతో అవసరం. మీరు చిత్తూరు జిల్లా వారవటం వల్లనూ మద్రాసులో చదువు కొనటం వల్లనూ మద్రాసు మీకు కొత్తగాదనీ. దగ్గర కూడ కాబట్టి తప్పక యీ అవకాశాన్ని ఉపయోగించు కోటానికి వస్తారనీ. రావ్ మకాం మద్రాసులో ఏర్పాటుచేసి. రావ్ ఏదో అమెరికన్ కంపెనీ పని మీద వస్తున్నట్టూ, అన్ని తెలుగు పేపర్లలోనూ ప్రకటనలు యిచ్చారు. మీరు రాని పక్షం

లో, నేనే స్వయంగా మిమ్మలను కలుసుకొనో, లేక ఉత్తరం రాసో మీరు రావూ కలుసుకునే ఏర్పాటు చేయవలసి వచ్చేది."

"హార్టును మార్చటం వల్ల బ్రెయిన్‌లో వచ్చే సహజమైన మార్పుకు తోడు! ఆపరేషన్‌కు ముందు.... రావు లేనిపోని ఊహాలతో, అనుమానాలతో ఉండటవల్ల! యింత మార్పు అతడిలో వచ్చి ఉండవచ్చునని, అక్కడి మన శాస్త్ర వేత్తలకు అనుమానం ఉండటం వల్ల, మీ అందం, మీ ప్రేమా! రావ్‌ను మరల పూర్వపు మనిషిగా మార్చ వచ్చు నేమోనని ఆశించారు. అలాంటి మార్పు కొరకు నేను ఎదురు చూశాను. కాని లాభం లేక పోయింది. అతడికి మీరంటే జాలితప్ప, ప్రేమలేదు.''

''ఎవరో! తండ్రి, కూతురు, నా వెంట పడ్డారు. నేను ఆ వ్యక్తిని కాదని ఎంత చెప్పినా నమ్మటంలేదు. నా హృదయం ఏనాడో ఎండి ఎడారి అయింది, ఆ అమ్మాయి అందమైంది చదువుకొన్నది సంస్కారం గల అమ్మాయి అని పిస్తుంది. ఆయన కూడా పెద్దమనిషి లాగున్నారు. పాపం! ఎవడో ద్రోహం చేశాడు. ''అన్నాడు ఎంతో జాలిగా అలా అతను ఏమీ ఎరుగ నట్టుగా మాట్లాడుతుంటే, నాకూ ఏమి తోచకుండా ఉంది''.

''అయ్యో....భగవంతుడా, .మాకు,''

"అమ్మా.... నళినీ! చదువుకున్నదానివీ, పరిస్థితులను అర్థం చేసుకో గలదానివీ.... మీరే.... యిలా! దుఃఖపడుతూంటే! మీ నాన్న గార్ని చూడండి.... యీ వయస్సులో ఆయనకు.... యీ బాధను భరించటం ఎంత కష్టమో ఆలోచించండి, ఆయన సుఖం మీ చేతుల్లో ఉంది.... కనీసం ఆయన కోసమైనా మీరు దుఃఖాన్ని దిగమ్రింగి- ధైర్యంగా ఉండాలి.... మీరే ఆయనకు ధైర్యం చెప్పాలి! జరిగినదంతా. ఒక పీడకలగా భావించి, గుండెను రాయి చేసుకొని.... భవిష్యత్తుని సుఖమయం చేసు కుంటానికి ప్రయత్నించాలి.... దీనిలో ఎవరి తప్పు ఏమి లేదు. బాధపడి చేయగలిగింది ఏమి లేదు. మనిషి ఆశించినట్టు అన్నీ సవ్యంగా జరిగితే.... జీవితానికి అర్థమే ఉండదేమో!'' మీ భవిష్యత్తు మీ చేతుల్లోనే ఉంది, అన్నీ మీకూ తెలుసు.... నేను చెప్పవలసిందీ ఏమీ లేదు ''

"మూర్తిగారూ! తిరిగి వెళ్ళిన తరువాత యీ ఫలితాలు తెలుసుకున్న శాస్త్రజ్ఞులు, మరేమైనా మార్గాల ద్వారా ఆయనను మామూలు మనిషిని చేయగలిగితే మీరు! నాకు''.

''ఇది నీవు నాకు చెప్పాలా అమ్మా! అడుగో రావ్....బయటకు వచ్చాడు.... వస్తా! శెలవ్''.




“పార్వతీ! పార్వతీ!” హడావుడిగా ఇంట్లోకి వచ్చిన విశ్వం, హాల్లో ఈజీఛేర్‌లో వెనక్కు వాలి.... వేళగాని వేళ నిద్రపోతున్న పార్వతిని చూచి నిర్ఘాంతపోయాడు క్షణ కాలం.

మరు క్షణంలో, అందాకా అతగాడిలో పొంగి వున్న ఉత్సాహం చప్పున చల్లారి పోయింది.

పార్వతి ఆ సరికే త్రుళ్ళిపడి లేచింది.

"ఏమిటీ? మళ్ళీ జ్వరం వచ్చిందా?" కంగారుగా పార్వతి నుదుటి మీద చెయ్యి వేస్తూ అడిగాడు విశ్వం.

"లేదు లోపలికి పదండి. మీకు కాఫీ యిస్తా!" అతగాడి చెయ్యి తీసి వేస్తూ, విర్లిప్తంగా లోపలికి నడిచింది పార్వతి.

ఆమె వెనుకనే వస్తున్న విశ్వం, బలహీనంగా వున్న పార్వతినీ, తూలుతున్నట్టున్న ఆమె శరీరాన్నీ చూస్తూ "పార్వతి ఎలా మారిపోయిందీ!" అన్న జాలితో వశీభూతమై పోయాడు క్షణ కాలం.

గాసుతో కాఫీ తెచ్చి, టీపాయ్ మీద పెట్టి, తిరిగి వంటింట్లోకి వెళ్ళి, ఏదో పని చూసుకోంబోంది పార్వతి.

విశ్వానికేదో చికాకుగా వుంది.... మరేదో అక్కసుగా వుంది....ఇంకేదో ఆకర్షణ లోపల్నుంచి ఎగసి వస్తోంది.... మనసు కళ్లెం లేని గుర్రంలా చిందులు తొక్కుతోంది....ఏదో స్థిర నిర్ణయాని కొచ్చినట్లు, బాత్‌రూం కేసి నడిచాడు. వంటింట్లో పీట మీద కూర్చుని, గోడ నానుకుని కళ్ళు మూసుకుని వుంది పార్వతి....

"మంచులు వైంకు వేసుకున్నావా పార్వతీ?" వెళ్తూ-వెళ్తూ ఒక్క నిముషం ఆగి, యాంత్రికంగా అడిగాడు.

"ఆ!" అదే విర్లిప్తమైన జవాబు.

బాత్‌రూంలోకి వెళ్ళి తలుపు వేసుకున్నాడు. అతగాడి మనస్సులో చికాకు. "పార్వతిలో శారీరకంగానే కాదు, మానసికంగా కూడా వచ్చిందేదో మార్పు. రావీ! అందుకు నేనేం బాధ్యుడ్ని కాను.... డాక్టర్‌కు చూపించాను....మందు లిప్పిస్తున్నాను. విశ్రాంతి కేం లోటులేదు.... ఇక ఆమెలో బలమూ, ఉత్సాహము రాక పోతే నేనేం చెయ్యగలను? నా సరదాలు ....నా సంతోషం....అన్నీ....ఛీ....ఛీ!" నీళ్ళు గుమ్మరించుకుని బాత్‌రూంనుంచి బయటపడ్డాడు. ఐదు నిముషాల్లో డ్రెస్ చేసుకున్నాడు. "నే వెళుతున్నా పార్వతీ! తలుపేసుకో. బహుశా పిక్చర్‌కు వెళ్తానేమో ఫ్రంచ్స్ అందరం....నా కోసం ఎదురుచూడక, భోజనంచేసి పడుకో!"

వరండా చీడీలు దిగుతూ వెనుదిరిగి చూశాడు. హాల్లో ద్వారబంధం ఆనుకుని నిల్చుని తనవేపే చూస్తోంది పార్వతి.

"పీక్కుపోయిన ముఖంతో, గుంటలు పడ్డ కళ్ళతో, పాలిపోయి చెక్కినట్లున్న బుగ్గలతో, ఊడిపోయిన పిచ్చి జుట్టుతో, ఎండిపోయిన గుండెలతో....ఛీ....ఛీ.... [illegible] ఈ పార్వతిని ఎలా భరించటం?" ఏవో తరుముతున్నట్లు గబగబ చీకట్లోకి నడిచాడు విశ్వం.

"ఇదేమిటక్కయ్యా! ఇదేదో ఎయిత్ వండర్‌లా వుంది! విశ్వం బావగారు వంటరిగా ఈ మధ్య సినిమాలకూ. షికార్లకు చెక్కేస్తున్నారు!" ఎదురింటి శారద పరుగెత్తుకవచ్చి పార్వతిని అడిగింది.... ఏదో ఆలోచిస్తున్న పార్వతి శారద మాటలతో ఉలిక్కిపడింది. 'అదేం లేదు ... నాకే ఏమిటో ఓపికలేక రాలేనన్నాను'' నవ్వేస్తూ అంది పార్వతి.

''భలేదానివే! పిక్చర్‌కెళ్ళటానికి ఓపిక లేకపోవటమేమిటి! మావారు నన్నడగాలే సుడిగాలిలా వచ్చినంత వేగంగానూ వెళ్ళిపోయింది శారద

శారద మాటలెందుకో వెన్ను చరిచినట్లయ్యాయి పార్వతికి. తనే ఓపిక తెచ్చుకోవాలా? ఎలా? ఎవరి కోసం ...అంతటి నీరసంలోనూ, మేడ మీదకు వెళ్ళింది పార్వతి. విశ్వం కోసం చూపులు వీధి కొస వరకూ వెళ్ళి తిరిగి వచ్చాయి .. అక్కడే ...ఆ వీధి మలుపులోనే ... మొన్ననో రోజు ...ఇదే వేళలో, వాళ్ళ ఆఫీస్ టైపిస్ట్ దేవకితో....నవ్వుతూ

**కనిపించని గాయం మానసికంగా ఎంత కృంగ దీస్తుందో___ అలాగే నటన అనే ఓ ప్లాస్టర్‌తో దాన్ని కప్పివేస్తే మగవాడికి కావలసి అన్నిహంగులూ స్త్రీశరీరంలో పొందిక అవుతాయి.గాయం మాత్రం ఎన్నటికీ మానదు!**

గానీ. నూటనాలుగు డిగ్రీల జ్వరంతో నయినా సరే .. తయారై వెళతాం!''

''సర్లె! నువ్వంటే చిన్నపిల్లవు .. మొన్న మొన్న పెళ్ళయినదానివి ..''

"నువ్వేమరీ ముసలి ముత్తైదువు! ఛాల్లే అక్కయ్యా! ఇవే పాట నేర్చుకున్నావే [illegible]! అన్నిటికీ 'పెనిమిటి'.... ఓపిక లేదు ..'' అంటూ, ఓపిక మనం తెచ్చుకోవాలే గానీ, దానంతట అదే వస్తేరాదు ....హమ్మయ్యో! స్టౌమీద పాలు పొంగిపోయాయో ఏమిటో .నే వెళ్తాస్తా!''

మాట్లాడుతూండటం తను చూచింది. ఆ రోజూ ...ఇలాగే పిక్చర్‌కు ...వంటరిగా, కనీసం తనను మాట మాత్రంగానైనా ''వస్తావా? ...'' అనేనా అడక్కుండా వెళ్లాడు!

ఆ మనుషులా తనేం [illegible] మనిషి కాదు .. కాలస్వభావాన్ని, మనుషుల మనస్తత్వాన్ని, వాతావరణ ప్రభావాన్ని అర్థం చేసుకోలేని [illegible] గాని, [illegible] గాని, [illegible], పను గురిలో మెరుపులా వచ్చినప్పుడు సరదా సమ్మోహనం, 'రొమాన్స్' ఎంజాయ్

చెయ్యటం లాటివి 'నైతిక పతనం' అనే హెడ్డింగ్ క్రిందకు త్రోసివేసే కుసంస్కారి కాదు....

కానీ....ఆ దేవకి మొన్ననో రోజు ఇంటికి వచ్చింది.

"ఏమిటండీ పార్వతీ! మీరిలా తగ్గిపోతున్నారు!" అంది ఆశ్చర్యంగా తనకేసి పరకాయించి చూస్తూ.

"మొన్న మీరు చూచినప్పటి కంటే మెరుగ్గా లేనూ?...." అంది తను నవ్వుతూ.

"ఏం మెరుగో! ఎముకలు బయట పడ్తున్నాయి!" అనేసింది దేవకి.

"ఎగ్జాక్ట్లీ! కొన్నాళ్ళకి, సైన్స్ లేబొరేటరీలో స్టాండ్ కి తగిలించవలసి వస్తుందేమో మా ఆవిడని ..." అన్నాగు విశ్వం కొంత కోపం, మరికొంత తెచ్చుకోలు నవ్వూ, మిళితమైన కంఠస్వరంతో.

"ఛీ....ఛీ....అలా మాట్లాడుతారేమిటి?...." చనువుగా మందలించింది దేవకి, "మంచి మెడిసిన్స్ వాడరాదూ?" అంది చక్రాల్లాటి కళ్ళు....అందంగా తిప్పుతూ.

"ఒక మందా? ఒక డాక్టరా? పార్వతినే అడగండి కావలిస్తే....ఫారిన్ రిటర్న్డ్ డాక్టర్స్... స్పెషలిస్ట్స్....ఒకరేమిటి? ఖాళీ మందు బాటిల్స్‌తో ఓ అల్మైరా నిండి పోయింది! పొరబాటుగా ఎవరేనా మా ఇంట్లోకి అడుగు పెడ్తే, ఇదేదో డిస్పెన్సరీ అనుకుంటారు ఏదీ మా పార్వతిలో మార్పు వస్తేనా? పర్మనెంట్ పేషంట్‌లా తయారౌతోంది!.... అసలు మీ ఆడవాళ్ళంతా ఇంతేనేమో! లావెక్కటం మొదలెడితే, ఇక ఆగకుండా

---

❊ రోగిని పరీక్షించి మన స్తత్వవేత్త యిలా అన్నాడు: "మీది ద్వంద్వ వ్యక్తిత్వం. అంటే మీరు గాక, మీలో మరొకరున్నారు."

"అది ప్రమాదము" అన్నాడు రోగి.

"ఒక విధంగా ఔను; మరో విధంగా కాదు" అన్నాడు మన స్తత్వవేత్త.

"సరే....ఎంతిమ్మంటారు?"

"పది రూపాయిలు" అన్నాడు మన స్తత్వవేత్త.

"నా భాగం యిదో యిస్తున్నాను. మిగతా సగం నాలోని రెండో వ్యక్తి దగ్గర్నుంచి వసూలు చేసుకోండి" అన్నాడు రోగి.




అడ్డం పెరిగి పోతారు....సన్నబడటం ప్రారంభిస్తే . అస్థిపంజరాల్లా మారి పోతారు.''

''నేనూ అడ్డం పెరిగి పోతున్నా నంటారా, కొంపదీసి!'' దేవకి భయంగా అడిగింది, తనను తాను చూసుకుంటూ

''నో-నో మీరు లావనిపించరు. హెల్తీగా, హాయిగా వుంటారు....దేనికైనా పెట్టి పుట్టాలి. ఆరోగ్యమే అష్టైశ్వర్యాలు, అనారోగ్యమే సిసలైన దరిద్రము—అంటారందుకే....''

వాళ్ళిద్దరి సంభాషణలో, శ్రోతగా మిగిలిపోయిన తను ఎలా ఫీలౌతోందన్నది ఇద్దరూ పట్టించుకోనేలా లేరు! మౌనంగా కూర్చుండి పోయింది.

దేవకిని సాగనంపటానికి వెళ్ళాడు విశ్వం. అప్రయత్నంగా వరండాలోకి వచ్చింది పార్వతి. కబుర్లలో పడి అక్కడ లైటు వెయ్యలేదు ఇందాకా! హాల్లో లైటు కొద్దిగా, వరండా ప్రక్కగా ప్రసరిస్తోందంతే....వరండా ప్రక్కన పొదలా పైకి అల్లుకుంటున్న 'క్రీపర్స్' మాటున-దేవకి చుట్టూరా చేతులు వేసి, గుసగుసగా ఏదో చెబుతున్నాడు విశ్వం. 'షాక్' తిన్నట్లయ్యింది క్షణ కాలం. సంబాళించుకుని, సవ్వడి కాకుండానే తిరిగి వచ్చేసింది లోపలకు.

దేవకి గేటు దాటి వెళ్ళాక, పొంగి పొరలుతున్న ఉత్సాహంతో లోపలకు వచ్చాడు విశ్వం.

"ఎలా అయినా దేవకి 'బ్యూటిఫుల్ ఫిగర్ కదూ పార్వతీ? అట్టే పొడగరి కాకున్నా-మాంఛి ఆరోగ్యంతో, నవనవ లాడే యాపిల్ పండులా వుంటుంది.... మిసమిస లాడే ఆమెను చూస్తుంటే, డన్‌లప్ పిల్లోస్... బెడ్స్ .. గుర్తుకు వస్తాయి కదూ?"

"అవును!"

అప్పుడుగానీ తలెత్తి పార్వతి వేపు చూడలేదు విశ్వం. ఏదో లోకంలో తేలి పోతున్నట్లున్న అతగాడి ఆనందానికి 'వాక్యూమ్ బ్రేక్' పడిపోయింది!

"ఓ! సారీ! జలసీ, దై నేమ్ ఈజ్ వుమన్!" అన్నాడు తన మాటల్ని ఎగ తాళి క్రిందికి మార్చేస్తూ?

"నో-నో....దై నేమ్ ఈజ్ మెన్!" నవ్వేస్తూ అంది పార్వతి. ఇద్దరూ నవ్వు కున్నారు. కానీ ఆ నవ్వులో నిండుదనం, నిండు హృదయం, హాయి లేవని ఇద్దరికి తెలుసు....

ఆ రాత్రంతా తనకు నిద్ర పట్టలేదు.... విశ్వంలో ఎందుకంతటి మార్పు వస్తోంది?

తనకి ఫ్లూ రావటం తన తప్పా! అది న్యుమోనియాగా మారటం తన తప్పా? ఆ తర్వాత నెల తిరక్కుండా తిరిగీ టైఫా యిడ్ అటాక్ కావటం తన బాధ్యతా? ఆరోగ్యం క్షీణించింది. జుత్తు వూడి పోయింది. ఆ సమయంలో కొద్దిగా కోలు కున్నంతలో విశ్వానికి కాంపులూ,తనకు ఇంటి దగ్గర పని మనిషి రాకపోవటం, తప్పనిసరి చాకిరీ తోడు కావటంతో, టైఫాయిడ్ తిరగబెట్టింది. అది తనని జీవచ్ఛవంలా మార్చి వదిలింది!

ఏ మాత్రం పని, శ్రమ తగిలినా గుండె నొప్పి, ఆయాసం, జ్వరం ముంచుకు వస్తున్నాయి. కనీసం ఆరు నెలలేనా చాలా విశ్రాంతి, బలమైన ఆహారం, మానసిక మైన ప్రశాంతత చాలా అవసరమని చెప్పారు డాక్టర్లు.

ఆ మందులూ వాడుతోంది. ఆహారం పుచ్చుకొంటోంది. కానీ, రోజులు జరుగు తున్న కొద్దీ, విశ్వం ప్రవర్తనలో, మాట

---

● "మన పెళ్ళి స్థిరపరుచుకునే ముందు గతంలో చేసిన పొరపాట్లు చెప్పటం నా విధి!" అన్నాడు అతను.

"రెండు వారాల క్రితం చెప్పావు కదా?" అన్నదామె.

"ఔను....అది రెండు వారాల క్రితం! ఆ తరువాత వాటి విషయం చెప్ప వొద్దా?" అన్నాడు అతను.

అలో మార్పు తనని చిత్రహింస చేస్తున్నాయి. మానసికంగా ప్రశాంతతన్నది లేకుండా చేస్తున్నాయి.

విశ్వం మేనకోడలు మీనాక్షి. పొట్టిగా లావుగా వుంటుంది. మొహం మాత్రం చాలా బావుంటుంది.

"మీ మీనాక్షి చాలా బావుంటుంది. లక్ష్మీ కళ...." అంది తనోమారు. అప్పట్లో తను ఆరోగ్యంగా వుంది.

"ఎవరు? మా మీనాక్షా? దాని దో అందమా! అదెలావుంటుందో సరైన వుదాహరణ నే చెప్పనా? తెల్లని పీపా బోర్లించి. దానిమీదో చిన్న చెంబు బోర్లించి. చుట్టూరా పట్టుచీరె చుట్టబెడితే ఎలాఉంటుందో.... సరిగ్గా అలాగే వుంటుంది! పార్వతీ! మెరుపు తీగలా. సన్నగా, పొడుగ్గా వుండే నువ్వే ఎంతో అందంగా వుంటావు! నువ్వు మాత్రం ఎప్పుడూ అలా లావుకావద్దు. నే భరించలేను!" అనేశాడు విశ్వం.

"ఒకవేళ లావెక్కితే? ముప్ఫై ఐదేళ్ళు వచ్చేసరికి, ఆడవాళ్ళు వద్దన్నా లావై పోతారుట! ముఖ్యంగా పిల్లలు పుట్టాక...." అంది తను ఉడికిస్తూ.

"పిల్లల జంజాటం ఇప్పట్లో మన కొద్దు. ఇక ముప్ఫై ఐదేళ్ళ సంగతంటావా? నీకు ఒళ్ళు వస్తోందన్న అనుమానం నాకు తగలగానే....ఆహార నియమం అమలు పరిపిస్తాను నీ చేత. వ్యాయామం చేయిస్తాను. ఈత నేర్పిస్తాను. మైళ్ళకొద్దీనడిపిస్తాను....హాయిగా తెగనవ్వకుండా లేనిపోని చికాకులు కల్పిస్తాను...."

అలా అన్న విశ్వం, ఈ నాడు రుబ్బుడు పొత్రంలా వున్న దేవకిని అంతలా మెచ్చుకుంటున్నాడు, హత్తుకుంటున్నాడు! దీనంతటికీ తన అనారోగ్యం ఒక్కటే కారణమా?

* * *

పార్వతీ! పార్వతీ!"

---

క్రిందనుంచి పిలుపు వినిపించటంతో, ఆలోచనల్లో విహరిస్తున్న పార్వతి మెట్లు దిగి పరుగెత్తుకవచ్చింది. అయాసం వచ్చేసింది విశ్వం హాల్లోనిల్చునివున్నాడు.

"ఏమిటిది పార్వతీ! తలుపులన్నీ బార్లా తీసిపెట్టి, మేడమీదకు వెళ్లావేమిటీ?"

"ఇప్పుడిప్పుడే వెళ్ళాను లెండి, ఆరేసిన బట్టలు తేవటానికి! మీరు పిక్చర్‌కు వెళ్లలేదా! ఇంకా తొమ్మిది గంటలు కాలేదు!"

"ఊహూఁ ఓ ఫ్రెండింట్లో కూర్చుని వస్తున్నా నంతే! అక్కడే భోజనం చేశాను. నువ్వు తిన్నావు కదా!"

"ఊఁ!"

"మంచి పని చేశావ్!" పార్వతివేపు పరిశీలనగా చూచివుంటే, ఆమె భోజనం చెయ్యలేదని తెలిసివుండేది! కానీ ఆ ఓపిక తగాడి కిప్పుడు లేదు. అతగాడి మనస్సు ఇంకా దేవకి చుట్టూరానే పరిభ్రమిస్తోందని పార్వతి కిట్టే అర్థమైపోయింది.

"మందులు వున్నాయా? తేవ్వాలా?" పక్క మీద పడుకుంటూ అడిగాడు విశ్వం.

"వున్నాయి."

"రక్షించావు."

పది నిమిషాల నిశ్శబ్దం తర్వాత మెల్లిగా అన్నాడు విశ్వం ...."ఓ మాట చెప్పనా పార్వతీ!"

"చెప్పండి!"

"మగాడికి ఇద్దరుభార్యలుఅవసరం!"

"ఎందుకూ?" అనలేదు పార్వతి. ఇంతక్రితం తనని వుడికించటానికి,తనతో గిల్లకజ్జా పెట్టుకోటానికీ ఆ మాట అంటూనే వుండేవాడు విశ్వం.... ముఖ్యంగా నెల నెలా రెండు మూడు రోజులు....అతగాడే వంటపనీ. ఇంటిపనీ చూచుకోవలసి వచ్చినప్పుడు అందంగా చిరాకుపడ్తూ అనేవాడు "ఇలాటి సందర్భాలలో మగాడికి ఇంకోభార్య అవసరమోయ్ పార్వతీ! హాయిగా నీ లీవ్ పీరియడ్‌లో, ఆవిడ ఇంటిపని చూచుకుంటుంది!"

"ఆ తర్వాత?" అని తనడిగితే.

"దేవుళ్ళ పెద్ద భార్యలలానే మిగతా రోజుల్లో ఆవిడ, తులసిపూజ, అత్తమామలసేవ, అతిధి సేవ చేసుకుంటుంది."

అలాటి పరిహాసం ధ్వనించటంలే దీరోజు, అతగాడి కంఠస్వరంలో ఏదో సిద్ధాంతాన్ని దృఢపరుస్తున్నట్లుం దా గొంతు.

"ఏం పార్వతీ! పలకవు?" విశ్వం తిరిగీ అన్నాడు.

"ఏం పలకను? మీరు చెప్పండి." నవ్వటానికి ప్రయత్నిస్తూ అందిపార్వతి!

ఆ వెన్నెలలో... నవ్వబోతున్న ఆమె పళ్ళు. కళ్ళు వెళ్ళవచ్చి, చాలా అసహ్యంగా వున్నట్లు తోచింది విశ్వానికి.. దేవకి గుర్తుకువచ్చింది....ఇంత క్రితం. దేవకితో తను సరదాగా....సంభాషించిన






మధురఘట్టం గుర్తుకు వచ్చింది. తిరిగి వుత్సాహం పొందిం దతగాడిలో....

"దేవకి ఈ రోజు ఓ కొత్త డిజైన్ చీరె కట్టుకొంది పార్వతీ! చాలా బావుం దది!" యధాలాపంగా పార్వతిని పొదివి పట్టుకున్నాడు విశ్వం. అతగాడి మనస్సు నిండా దేవకిరూపం పరుచుకునివుంది.

"అబ్బా!" అప్రయత్నంగా మూలిగింది పార్వతి. ఆమె గుండె లోతుల్లో ఏదో బాధ. శారీరకమైన బలహీనత. అతగాడి బాహువలయంలోని కాఠిన్యం. క్షణకాలం ఊపిరి సలపనివ్వలేదామెకు.

గబుక్కున ఆమెను వదిలి, లేచి కూర్చున్నాడు విశ్వం. అతగాడి కళ్ళ ముందు పార్వతి స్పష్టంగా కనిపిస్తోంది.''

ఏమిటి పార్వతీ! మళ్ళీ గుండెనొప్పా?'' ఆదుర్దాగా అడిగాడు మీదకు వంగి.

"ఊహూఁ!" పక్కకు వత్తిగిలి పడుకుంది.

"భగవాన్!" అతగాడి కంఠస్వరంలో నిస్పృహ.

"గాభరా పడకండి! నా కేం బాధ లేదు!" నొచ్చుకుంటూ అంది.

"ప్చ్! నీ శరీరంమీద చెయ్యివేసి ఎన్నాళ్ళయ్యింది పార్వతీ!" విసుగ్గా అడిగాడు విశ్వం.

పార్వతి మాట్లాడలేదు.

"ఇంత అపురూపంగా నిన్ను చూచుకొంటూంటేనే, ఇంత బలహీనంగా వున్నావు నువ్వు....ఇక....ఇక ఈ

జన్మకా నీనుంచి నేను....ఏలాటిసుఖమూ, ఆశించలే ననుకుంటాను....కదూ?''

పార్వతి మాట్లాడలేదు.

''ఇక నా బ్రతుకు....నా బ్రతుకు....'' విశ్వం పిచ్చిగా జుట్టు పీక్కున్నాడు, కాస్సేపయ్యాక, విసుగుతో కోపంతో విస్పహాయంగా....గదిలోకి వెళ్లి తలుపు వేసుకు పడుకున్నాడు.. ఒంటరిగా మిగిలి పోయిన పార్వతికి. తనమీద తనకే అస హ్యంగా వుంది, విశ్వం ప్రవర్తన దుస్స హంగానూ వుంది.

ఆమెలో ఆలోచనలు తిరిగి విజృం భించాయి....

డాక్టర్ సలహా ప్రకారం, తనో ఐదారు నెలలు పుట్టింట్లో వుండి వస్తా నంది ...విశ్వం ససేమిరా అన్నాడారోజు.

''అదేమిటి పార్వతీ! ఎవరైనా వింటే నవ్విపోతారు! ఆ మాత్రం నిగ్రహంలేని చవటనా నేను! అస లీ విషయం మూడో వాళ్ళకు తెలియవలసిన అవసరం ఏముంది? అసలు అలా తెలియటం ఎంత అవమానం! నీ కేం భయంలేదు. నీ ఆరోగ్యం సరి అయ్యేంత వరకూ.... నువ్వు మామూలు మనిషివి అయ్యేంత వరకూ....మనిద్దరం....నిజమైన స్నేహి తులం....ఆత్మీయులం....సరా? అంతే కాదు....నా సంస్కారం నీకుతెలుసు.... నీకు తప్ప నా ఈ గుండెల్లో మరొకరికి స్థానం లేదు, వుండబోదు....నా ఈ చేతులు....నీ శరీరాన్నితప్ప....మరొకర్ని ....ఛీ....ఛీ....!'' అలా కబుర్లు చెప్పిన విశ్వం....ఈ రోజెంత అశాంతితో బాధపడుతున్నాడు. విశ్వం ఒక్కడూనా? లేక మగాళ్లందరూ ఇంతేనా? భార్య తాత్కాలికంగా బలహీనమైతే, తాత్కా లికంగా కొంత కాలంపాటు ''సెక్స్'' జీవితం గడపకపోతే, ఇకామె తమ జీవితసహచరిగా వుండదగదని నిస్పృహ చెందుతారా? అప్పుడు ''మరో భార్య'' ''మరో స్త్రీ'' ఆలోచన ప్రారంభిస్తారా? అలాగే స్త్రీలు ఆలోచిస్తే?

విశ్వాని కా మధ్య మలేరియా....వదల

---

● జైల్లోకి కొత్తగా వొచ్చిన వాడితో ''ఏం నేరం? ఎన్నాళ్ళు?'' అన్నాడొక వ్యక్తి.

''వెస్ట్రన్ బాంక్ దోపిడి చేసినందుకు ఎనిమిదేళ్ళు!....'' అన్నాడు కొత్త వ్యక్తి.

''నీ నేరం ఏమిటి? ఎన్నాళ్ళు?''

''వెస్ట్రన్ బాంక్ మేనేజర్ని నేను. పన్నెండేళ్ళు!''

కుండా రెండు నెలలు వేధించింది. షుమారు నాలుగు నెలలవరకూ అతగాడు మామూలు మనిషి కాలేకపోయాడు.... సన్నగా పూచికపుల్లలాటి కాళ్ళూ చేతులతో, పెరిగిన గడ్డంతో, ఎండిపోయిన గుండెలతో, ఎముకల ప్రోగులా. ఆయాసపడుతూండే అతగాణ్ని చూస్తున్న కొద్దీ, తనలో జాలి ముంచుకువచ్చేది! ఎన్నో వెన్నెల రాత్రులు, ఎన్నో కోర్కెలు గుండెలనిండా పొంగుతుంటే, విగ్రహంతో అణచివేసుకొనేది, మంచాని కంటుకుపోయినట్లు నిద్రపోతూండే అతగాణ్ణిచూస్తూ "భగవాన్! ఈయనకుత్వరగా ఆరోగ్యం ప్రసాదించు" అని మనసారా కోరుకొనేది. జాగ్రత్తగా మందులిచ్చి, పథ్యం చూచేది. ఆ సేవలో ఆ జాతిలో, ఆ ప్రార్థనలో ఏ ఒక్క క్షణమూ అతగాడు 'సంపాదించి పెట్టేవాడ'న్న స్వార్థం గానీ, కోర్కెలు తీర్చే 'లైసెన్స్‌డ్' సాథనం అని గానీ-కల్మషం లేదు.

"పాపం పార్వతీ! హాయిగా మరెవరినేనా కట్టుకుని వుంటే సుఖపడి వుండేదానివేమో! అర్భకుణ్ణి కట్టుకుని—సన్యాసినిలా కాలం వెళ్ళబుచ్చుతున్నావు కదూ!" అనేవాడు విశ్వం బాధతో.

"ఛీ-ఛీ.... అవేం మాటలు! ఇప్పుడు నాకేమైంది! మీకు మాత్రం ఏమిటి? రాజాలా వున్నారు! చక్కనమ్మ చిక్కినా అందమేనట!" అంటూ అతగాడు మానసికంగా నిరుత్సాహ పడకుండా, ఎప్పటికప్పుడు ఉత్సాహాన్నిచ్చేది! అదే టానిక్‌లా పనిచేసి, పది రోజుల్లో, విశ్వం మామూలు మనిషై పోయాడు.

కానీ ఈ రోజు! సరిగ్గా అందుకు భిన్నంగా జరుగుతోంది! ఇలా కాదు.... దీనికో అంతం చూడాలి. రేపు తన ఫ్రెండ్ డాక్టర్ సుభద్రను నిలవేసి అడగాలి. తనకిక ఈ జన్మకు బలం వస్తుందో

రాదో. తను ఆయనకు 'భార్య'గా వుండే అర్హత వుందో లేదో నిర్మొహమాటంగా చెప్పమనాలి.

అలాటి ఆశే లేకుంటే ఆయనగారినిక ఆయనగారికి నచ్చిన మార్గం చూచుకో మని తను తప్పుకోవాలి. తను చదువు కున్నది. ఏదో ఓ ఉద్యోగం చూచుకో వాలి....

''అమ్మో! అయ్యో!''

పెద్ద గోలతో గబుక్కున లేచి కూర్చుంది పార్వతి. గదిలోంచి విశ్వం కూడా బయటకు వచ్చాడు. తెల్లవారు ఝాము కావొస్తోంది. ఇద్దరూ అంత వరకూ నిద్ర పోలేదనటానికి చిహ్నంగా ఇద్దరి కళ్ళూ అగ్ని గోళాల్లా వున్నాయి.

క్రింద వీధిలో ఏదో కోలాహలం.... పిట్టగోడ దగ్గరకు పరుగెత్తారిద్దరూ.

ఎలక్షన్ల ప్రచారం సందర్భంగా, ఓ పార్టీ మనిషిని అవతలి పార్టీవాళ్ళు ఎత్తి కుదేశారు! బయటవాడికి పైకి కనిపించే గాయాలేమీ తగల్లేదు. కానీ లోపల ఏయే కీళ్ళు పట్టు సడలపోయాయో గానీ, లేచి నిల్చోలేక పోతున్నాడు. కొట్టిన వాళ్లెవరో పారిపోయారు! అతగాడెవరో కాదు.... విశ్వం ఆఫీసులోనే పని చేస్తున్న గోపాల రావు. నలభై యేళ్ళ లోపువాడే!

''అసలు వీకెందుకయ్యా ఎలక్షన్ల గొడవ!'' అంటున్నారెవరో.

''రక్తం పైకి కనిపిస్తే కేసవుతుందని కిరాతకులు ఈ పని చేశారు. గాయం కని పించకుండా చావుదెబ్బ కొట్టారు! ఇకా నడుము సరిగా వస్తుందో రాదో!'' తలకో రకంగా వ్యాఖ్యానిస్తున్నారు తెల్లగా తెల్లారి పోయింది.

''ఈ రోజు నేను మా స్నేహితురాలు డాక్టర్ సుభద్రను చూచి వస్తాను!'' అంది పార్వతి.

విశ్వం అభ్యంతరం చెప్పలేదు.

* * *

ఇదంతా జరిగి సుమారు ఎనిమదేళ్లు కావొస్తోంది. ఇప్పుడు పార్వతీ ఇద్దరు పిల్లల తల్లి అయింది. మీనాక్షీ కంటే మరి రెండు చుట్లు లావుగా వుంది.

డ్రెస్సింగ్ టేబిల్ ముందు కూర్చుని, ''ఛీ ... ఛీ విపరీతంగాలా వెక్కి పోతున్నాను'' అని పార్వతి అంటే. విశ్వం నవ్వేస్తాడు. ''లేదు.... లేదు. నిండుగా, హుందాగా, అందంగా వున్నావు'' అంటాడు.

---

''రాత్రికి ముగ్గురు అతిథులు వొస్తారు.'' అన్నది ఇల్లాలు వంట మనిషితో. ''వాళ్ళు మళ్ళీ తిరిగి రావలసి వుంటుందా? లేక ఇంతటితో పంపెయ్యట మేనా?'' అని అడిగింది వంట మనిషి.




"అసలు నీ కంటే అందగత్తె లెవరున్నారు పార్వతీ! ఏమిటో ఆ దేవకి రుబ్బురోలులా. మా మీనాక్షీ కాల్‌టెక్స్ పీపాలా.... ఛీ– ఛీ.... చూడటానికి అసహ్యమనిపిస్తారు. నువ్వు సరిగ్గా వున్నావు."

అలా విశ్వం అన్నప్పుడు పార్వతికి ఆనందమూ, గర్వమూ కలగటం లేదు. చప్పున గోపాలరావు గుర్తుకు వస్తాడు. అతగాడిప్పుడు పరిపూర్ణ ఆరోగ్యంతో వున్నాడు, కాని బాగా స్ట్రెయిట్‌గా నడువలేడు! డాక్టర్లకు కూడా అంతుబట్టని విధంగా, అతగాడిలోని ఎముక ఏదో విరిగిపోయిందానాడు. కనిపించని గాయం అది.

తనలోనూ అలాంటిగాయం ఒకటుందని విశ్వానికే నాడూ తెలిసే అవకాశం లే . .

ఆ రోజుల్లో .... తన శారీరకమైన బలహీనాన్ని, విశ్వం అంతలా అసహ్యించుకొనకుండా వుండి వుంటే. తాత్కాలికమైన ఎడబాటును సహనంతో ఎదుర్కొన గలిగి వుంటే కనీసం "నీకేం పార్వతీ! నువ్వు కోలుకుంటావు త్వరలోనే ... నీకు బలం వస్తుంది! నీ మీద నుంచి నా మనస్సు మరలదు!" అన్న ప్రోత్సాహకరమైన చల్లని మాట ఒక్కసైనా అని వుంటే....

ఆ నాడంతటి చిత్రహింస అనుభవించేది కాదేమో! డాక్టరు సుభద్ర మందులూ, మందుల కంటే ఎక్కువైనా ఓదార్పు, తిరిగి తనని మనిషిని చేశాయి!

విశ్వానికీ రోజు తను సర్వస్వం కావచ్చు....

కానీ తనలో వున్న ఆ కనిపించని గాయం.... ఏ నాటూ మానిపోదు!

# పునర్జన్మలున్నాయా?

**1935లో జార్జ్ కేస్టర్ అనే సైనికుడు లండన్ నుండి వెలువడే "సండే ఎక్స్‌ప్రెస్" లో తన అనుభవాల్ని గురించి చర్చించాడు.**

కేస్టర్ 1889 లో జన్మించాడు. చిన్నప్పటినుంచీ నిద్రలో మాట్లాడే అల వాటుంది. నిద్రలో ఒక్కోసారి అతడు స్వచ్ఛమైన బర్మా భాష మాట్లాడే వాడు. 1907 లో సైన్యంలో చేరాడు. తన 20వ ఏట 1909 లో మేమియో (బర్మా)కు ట్రాన్స్‌ఫర్ చేయబడ్డాడు.

మేమియో చూస్తూంటే అతనికి తానెప్పుడో ఆ ప్రాంతంలో నివసించినట్లని పించింది. ఆ బజార్లూ, మేడలూ-మిద్దెలూ చిరపరిచితంగానే అనిపించాయి. పెద్ద మర్రిచెట్టు కనపడింది. దాని క్రింద తాను ఆడుకొన్నట్టు గుర్తుకొచ్చింది. అలా ఎన్నెన్నో అతనికి అనిపించాయి.

తన స్నేహితుడు లాన్స్ కార్పోరల్ కారిగన్‌తో ఇరావది నది తనకు ఇంతకు ముందే తెలుసునని చెప్పాడు. ఆ నదికి అటువైపు ఒక గుడి వుందని ఆ గుడి గోడ ఒక దానికి పెద్ద పగులు వుందని చెప్పాడు. ఆ పక్కనే గంట కట్టబడి వుందని అన్నాడు.

కారిగన్, కేస్టరూ ఇద్దరూ నది దాటి గుడికెళ్ళారు. కేస్టర్ గుర్తించినట్టుగా అంతా సరిపోయింది. కేస్టర్ ఇంతకుముందెప్పుడూ ఈ ప్రాంతాలకే రాలేదని కారిగన్ చెప్పాడు.

—కొల్లికుదురు రాజశేఖరరెడ్డి.



# చెప్పు కథ


గజ్జల దక్షిణామూర్తి


చెప్పులు రెండు: ఒకటి నామవాచకం చెప్పు, రెండోది క్రియా చెప్పు.

తెలంగాణ ఉద్యమ సందర్భంలో ముఖ్యమంత్రి బ్రహ్మానందరెడ్డిగారు తెలంగాణ పర్యటిస్తానని ప్రకటించింది విని, కాళోజి కవి ఆయనను ఆహ్వానిస్తూ, బజార్లలో....

'నిశ్చలముగ పాత చెప్పు
నిరసనను దాటి చెప్పు''

అన్నారు ఇక్కడ మొదటి పాదం చెప్పు నామవాచకం చెప్పు. రెండో పాదం చెప్పు క్రియా చెప్పు. రెండు పాదాలకి రెండు రకాల చెప్పులన్న మాట.

పూర్వం ఒక మునీశ్వరుండే వాడు. ఆయన విలువిద్యలో చెప్పుకొనతగ్గ ప్రావీణ్యం సంపాదించాడు. ఒకనాడు మండుటెండలో భార్యామణి (ముని చెప్పు

చేతుల్లో ఉంది కాబట్టి) బాణాలందిస్తుంటే ఆయన వేటాడుతున్నాడు. ఎండ వేడికి బాగా అలిసి పోయాడు. ఎండను చూసి మండి పడి, సూర్యుని పైకి విల్లెక్కు- పెట్టాడు. చెప్పొద్దూ? సూర్యుడు భయ పడి పరుగెత్తుకొచ్చాడు. మునికి చెప్పులు, గొడుగు యిచ్చి ఎండ నుండి కాపాడుకో డానికి వాడుకోమన్నాడు. ఇదీ చెప్పుల జన్మ వృత్తాంతం.

మునీశ్వరుని కోపమే భూమ్మీద చెప్పుల అవతరణకు కారణభూతమైంది కనుకనే ఇప్పటికీ ఎవరైనా, కోపం వస్తే, చెప్పుతో కొడతాన'ని బెదిరిస్తారు.

తెలుసుకున్న ప్రజలు ఈ మధ్య చెప్పులు కాక, మురిగిన టొమాటోలు కోడిగుడ్లు విసురుతున్నారట. అయితే ఆ వక్తలు అవి మాత్రం మోపుకు పోరని నమ్మక మేమిటి చెప్మా!

మనసులో కోపం ఉంటే దేవుడు చల్లగ చూడడంటారు అందుకే గుళ్లోకి పోయేముందు కోపానికి ప్రతిరూపాలైన చెప్పులను ద్వారం వద్దే వదలి లోనికి వెళ్తారట అసలు దేవుని ధ్యానించేపుడు చెప్పులతో మనకు సంబంధమే ఉండ రాదట. అందుకే—అర్జెంటు పనుల మీద గుడిముందు నుంచి వెళ్లే, గుళ్లోకి పోక

---

చెప్పులు రెండు - ఒకటి నామవాచకం చెప్పు, రెండవది క్రియా రూపకం చెప్పు. ఏ చెప్పుకైనా కోపం "కు్క్కవే!?

---

కొందరు కొడతారు కూడ. ముఖ్యంగా ఎడమకాలి చెప్పుకు కోపం ఎక్కువ.

"అప్పులోడు వస్తే
చెప్పుతోవి కొట్టా."

అని పిల్లలు పాడుతుంటారు. ఆ అప్పి చ్చిన వాడు అప్పిచ్చింది చెప్పులు కొను క్కోను కూడ కావచ్చు.

సమావేశాల్లో వక్తల మీది కోపం వల్లనే చెప్పులు విసరడం జరుగుతుందని ఇంకా చెప్పుకోనాలా? అయితే ఈ వక్తలు త్వరలో చెప్పుల షాపులు తెరుస్తున్నారని

బజార్లో నిలచైనా—నమస్కరించేపుడు చెప్పులు విడుస్తారు. అయితే వీళ్ళ చిత్త మంతా చెప్పుల మీదే.

ధ్యానభంగం కలుగకుండా ఉండేందు కని కొందరు గుడికి చెప్పుల్లేకుండా పోతారు. అయితే వీరి ప్రార్థన—ఇంట్లో విడిచిన చెప్పుల్ని కాపాడమని కాదు కదా?

గుళ్ళలో మగాళ్ళ —

"కళ్ళు కాళీ మీద
చిత్తం చెప్పుల మీద"

ఉంటాయి. వీళ్ళ ఛిత్తం ఎవరి చెప్పుల మీద? కాళీ (స్త్రీ) చెప్పుల మీదా?

ఇంత చెప్పుకొన్నదాన్ని బట్టి తేలేది- చెప్పు కోపాన్ని చాటిచెప్తుందని మరి కాళోజికవి నిరసనను చాటుతుందన్నారు? అది పాతచెప్పు లెండి.

చెప్పులు ప్రేమ చిహ్నాలు కూడ. అందుకే అవి ప్రేమ వ్యవహారాల్లో ఫ్రీగా వాడబడతాయి.

చెప్పులు ఎన్నెన్నో! ధనికుని ఎంత చెప్పుకు అంతగొప్ప. పేదవాని ఎంత చెప్పుకు అంత అప్పు. గాంధీ చెప్పులకు ఓ ప్రత్యేకత ఉంది.

పూర్వకాలంలో గాంధీ అనే ఒకాయన ఉండేవాడట. కొందరు ఆయన్ని పిచ్చి వాడని. యింకొందరు తలతిక్క మనిషని అంటుంటారు. అందరూ అంగీకరించేది మాత్రం—ఆయన పేదవాడని ఆయన చెప్పులు చాల తక్కువ ఖరీదువట. కాని అదృష్టం వరించి మంచిపేరు సంపాయిం చాడట. ఈ మహిమంతా ఆయన చెప్పు ల్లోనే ఉందని ఆ మోడల్ చెప్పులు వేసు కుంటున్నారు చాలమంది. అయితే ఆయన "చెప్పడాలు" (సేయింగ్స్) మాత్రం వినరనుకోండి. ఆయనలాంటి "పిచ్చి వాళ్ళు" కొందరంటుంటారు- వీళ్ళంతా ఆయన చెప్పుకూడా కొరగారని.

చెప్పు తినకపోతే చెడగా చూడాలం టారు. అందుకే పెద్దలు "చెప్పు తినాలి" (చెప్తే వినాలి).

చెప్పుతిన్నా జీర్ణంకావాలి మరి. గాంధీ 'చెప్పుతిన్న'వా ళ్ళిపుడు ఎంతమందిలేరు? లాభం?

"సత్యమే చెప్పు" అన్నారు ఆయన. అంటే చెప్పు ఏదో కాదు సత్యమనేదే చెప్పు అని కొందరు; ఎవరెవరి (దుర) దృష్టాంతమో చెప్పి. నిజం చెప్తే చెప్పు దెబ్బలు తినాల్సివస్తుందని యింకొందరు —వాదిస్తూ చెప్పులతో కొట్టుకుంటు న్నారు. సత్యం చెప్పమనే వాళ్ళకొందరు 'చెప్పి చావరా' అంటారు. అంటే సత్యం చెప్పగానే చావాల్సిందేనా? అయితే రెండో వర్గంవారి వాదన రైటా?

"అమ్మా! చెప్పమ్మా" అనగానే తండ్రిముఖం చూసింది. ఓ అమ్మాయి. ఆమెపేరు చెప్పమ్మా? ఉప్పలమ్మలా ఇదేం పేరు చెప్మా!

---

❊ "ఎప్పుడన్నా రైలు ప్రమాదంలో ఇరుక్కున్నావా?" అని అడిగాడొకడు స్నేహితుణ్ణి.

"ఒక్కసారి జరిగింది. రైలు సొరంగం గుండా పరుగెత్తుతూన్నప్పుడు కూతుర్ని ముద్దు పెట్టుకోబోయి, పొరపాటున ఆమె తండ్రిని ముద్దు పెట్టు కున్నాను!" అన్నాడు ఆ స్నేహితుడు.




'కుక్క బెదిరించి చెప్పెత్తుకు పోయిందంటారు. అంటే -ఎంతో ఆగడం చేసి అన్యాయంగా సాధించింది. అణుమాత్రమేలే అని భావం. ఈ మాట అనేవాడు చెప్పులాంటి దేదో పోగొట్టుకుని. ఎత్తుకుపోయినవాన్ని కుక్కను చేస్తాడు. చెప్పుపోతే కోపంపోయినట్టో. శని పోయినట్టో అనుకుంటే- ఆ మనిషి అలా అగుపించడుగా మరి? ఇక చెప్పులదొంగ -కుక్కా? అది విశ్వాసం గల జంతువు కదా?

'కుక్క కాటుకు చెప్పుదెబ్బ' ఎందుకో అర్థంకాదు. కుక్క కాటుకు మందు తెలియని రోజుల్లో కాటుమీద చెప్పుతో కొట్టేవారని కొందరంటే; కరచిన కుక్కనే చెప్పుతోకొట్టేవారని మరికొందరంటారు. ఇంకా కొందరు ఇలా చెప్తారు: ఓ పేదవాని కొడుకును కుక్క కరిస్తే ప్రభుత్వాసుపత్రికి తీసుకువెళ్ళారట. అసలే ప్రభుత్వాసుపత్రి - అందునా పేదవాడు పాపం! డాక్టరు దయతలచలేదు. ఆ పేద

వానికి కోపంవచ్చి డాక్టరును చెప్పుతో కొట్టాడట, నాటినుంచి ఈ మాటట.

'చెప్పు తినెడి కుక్క— చెరకు తీపెరుగునా' అంటే కూడ ఓ కథ ఉన్నది। చెరకుతోట గల ఒకాయన తోటవైపు తన పెంపుడు కుక్కను పోనిచ్చేవాడు కాదు. దానికి చెరకు తినాలని గొప్ప కోరిక. ఏం లాభం? యజమాని 'చెప్పు తిన్నది' కాబట్టి చెరకు తినలేకపోయింది. యజమాని మాట విననట్లయితే అది చెరకురుచి చూసేదే కదా?

'చెప్పులోని రాయి చెవులోని జోరీగ' లా బాధ కలిగిస్తుందట. ఎవరికి బాధ? ఎదురుగా ఉన్న నాయకులకు, పోలీసులకా? కొందరు నాయకులు రాళ్ళ దెబ్బలే కాదు, చెప్పుదెబ్బలు కూడ తింటారట.

'నా చర్మంతో చెప్పులు కుట్టిచ్చినా మీ ఋణం తీరదు' అనే అప్పారావు లేక అప్పాలామె మాటల్లోని అర్థం? బాకీ ఎగబెట్టడమేనా?—ఎలాగూ అలా చెప్పులు కుట్టివ్వమనరని.

'బెత్త పెద్దరికం చెప్పుల మోత' అంటే? బెత్త వాళ్ళలో పెద్దమనుషుల చెప్పులు బాగా మోత (ధ్వని) చేస్తాయని ఓ మిత్రుడన్నారు. నిజమేనా?

కొందరు గొప్ప చెప్పు కొంటారు. అదేం గొప్పో మరి?

సూర్యుని కృపవల్ల ముని ద్వారా భూమ్మీద అవతరించిన చెప్పులు, ఆర్మ్ స్ట్రాంగ్‌తో చంద్ర మండలం చూసొచ్చాయి. ఇందుకు సాక్ష్యం—చంద్రుని ముఖం మీది చెప్పుచ్చులే అని చెప్పచ్చు.

చెప్పుల గూర్చి ఎంత చెప్పుకొన్నా తెగదు. కాని ఎంత చెప్పు కొన్నా తెగదని మాత్రం చెప్పలేం, నడి రోడ్లో అది తెగి, తొడిగిన వాని తాడు తెంపుకుంది. అందుకే—అప్పులునోన్నితో చెప్పులునోన్నితో పోవద్దంటారు?

చెప్పు కథ ఎలా ఉందో? చప్పగానా? గొప్పగానా?

నువ్వు చెప్పు. (అంటే నువ్వు చెప్పు కాదు అర్థం)

మీరు చెప్పండి। (మళ్ళీ....?)

---

మేనేజర్ (గుమస్తాతో) "బల్ల క్రింద చేయి పెట్టటం కూడ నేర్చుకున్నావన్న మాట?''

"ఏదో మీ దయవల్ల మీ ఆఫీసులో కాలు పెట్టిన తరువాత నే లేండి.'' అన్నాడు గుమాస్తా.

—అసిలేటి కోటేశ్వరరావు, కురుమద్దాలి.

# మహాసంకల్పం

స్వార్థం ఎవరెస్టు శిఖరాన్నధిరోహించి
పతాకాన్నెగరేసి విజయగర్వంతో విర్రవీగుతోంది
అహంకారం ఆకాశాన్ని ముద్దాడుతోంది
మన నికృష్టపు జీవనాన్ని చూసి చల్లగా నవ్వుతోంది
మహాత్ముల ప్రవచనాలకు, ప్రబోధాలకు
విపరీతంగా విషజ్వరం వ్యాపించింది
వాటికి శయ్యే రుద్రభూమి కావడానికి ఇంకెంతో కాలం పట్టదు
దీనంగా ఒకదాని మొహం ఒకటి చూసుకొంటూ
శిధిలాలయంలో తల దాచుకొన్న సత్యాహింస జ్ఞానధర్మాలు
ఈనాటి మానవుణ్ణి పలకరించడానికి చూడ్డానికి భయపడుతున్నై
చరిత్రలో అతి హీనంగా, ధరిత్రిలో అతి నీచంగా బ్రతికే
మలినమైన మానవుడా! మంచితనాన్ని మరచిన మత్తునిద్ర నుండి లే!
లేచి తరా-తరాలుగా మనిషిని కప్పిన మంచు తెరలు
విడిపోయేలా కల్పాంతం వరకూ ఎన్ని వికల్పాలు వచ్చినా
చేస్తానని అల్ప ఫలితాన్నైనా సాధిస్తానని సంకల్పం చెయ్యి
ప్రగల్భాలు చెప్పకుండా, అందరూ చేసే మామూలు
సంకల్పం కాక ఒక మహాసంకల్పాన్ని చెయ్యి!....

సరస్వతీ సత్యశ్రీ

## పెద్దకథ



(గత సంచిక తరువాయి)

ఎమ్. ఎస్సి. పరీక్షలయ్యి ఇంటికి వచ్చాక ఎనిమిది రోజులకే కాలక్షేపం కాక విసిగెత్తి పట్నం వచ్చేశాడు తిరిగి హరనాద్.

ఉదయంనుండి మబ్బుపట్టి చల్లగా, హాయిగా ఉంది వాతావరణం. ఏవో వెర్రి కోరికలు పుడుతున్నాయి. రూమ్‌లో పాతుకుపోయి దినం వ్యర్థపరుచ కూడ దనిపిస్తూంది.

''ఈరోజు ఖుషీగా గడపాలనుందిరా! ఏంచేద్దామంటావు?'' అన్నాడు రూంమేటు మురళీధర్‌తో,

''ఖుషీ అంటే?''

''ఫ్రెండ్స్‌నుపిలిచి పార్టీచేసుకొందాం చక్కగా కబుర్లతో, పేకాటతో గడిపేద్దాం. నైట్‌కు పిక్చర్.''

''చచ్చు కోరిక! చవట కోరిక! తీసిపారేశాడు మురళి, ''చల్లగా మబ్బుపట్టింది, వయసు కుర్రాడివి. పార్టీలతో,

పిక్చర్లతో దొరికేది ఏ పాటి వినోద ఉత్సాహ మిస్తుందోయ్? నీకు నిజంగా ఖుషీగా గడపాలనుంటే నాతో రా,''

అర్థమైంది అతడి నవ్వుతో. ''సై'' అన్నాడు డ్రెస్ చేసుకోడానికి లేస్తూ. చూడబోతే నీకు అలవాటు ఉన్నట్లుందే?''

''ఏదో అప్పుడప్పుడు. వంట్లో తిక్క రేగినప్పుడు.''

మనసులో బెరుగ్గాఉన్నా ఏదో కుతూహలం మురళిలో ఈడ్చుకుపోతూంది. కొన్ని వీధులు తిరిగి ఓ రెండు అంతస్తుల

మురళిభుజం తట్టి వెకిలిగా నవ్వింది ఓ చిలుక.

''మిత్రుడే,'' సిగ్గు, సంకోచం ఏవీ లేకుండా ఓ కుర్చీ ఆక్రమించుకొని కూర్చున్నాడు మురళి. ''వాడు ఇలాంటి చోట్లకు కొత్త. హృదయంలో హత్తుకుపోయేట్టుండాలి ఈ దినం. వాణి ఏది? పిలువు ఓ పాట పాడనీ.''

గానాబజానా సాగుతూంటే అనహనంగా కుర్చీలో మెదలసాగాడు హరనాథ్, ''ఏకాంతంలో ఒక అందమైనఅమ్మాయి

# పోల్కంపల్లి శాంతాదేవి

మేడముందు ఆగాడు మురళి. ''అనాధ శరణాలయం'' బోర్డు చూచి అసహనం ప్రకటించగా హరనాధ్, ''ఇక్కడేం దొరుకుతుంది ఖుషీ?''

''లోపలికి పదవోయ్, ఇక్కడుండేది అనాథలు కాదు. అందకత్తెలు, పైన బోర్డు కేవలం సేఫ్టీ కోసం.''

ఎన్నడూ అంతమంది ఆడవాళ్ళలోకి పోలేదేమో - కళ్ళు చెదిరిపోయాయి హరనాధ్‌కు. రంగు రంగుల్లో రెపరెపలాడే సీతాకోక చిలకల్లా కులికేవాళ్ళను చూచి.

''మీ మిత్రుడా?'' అనవసరంగా

అయితే చాలు!'' అందరినీ పరిశీలనగా చూశాడు. వేషాలయితే ఆకర్షణీయంగా వేసుకొన్నారు గాని, సహజ సౌందర్యం ఎవరిలోనూ కనిపించలేదు విసుగ్గా వెళ్ళిపోవడానికి లేచాడు.

వీధిలో కారాగిన శబ్దం వినిపించింది. రెండు నిమిషాల్లో కళ్ళద్దాలు ధరించి, చేతికి రిస్ట్‌వాచికట్టి పట్టుచీరలో హుందాగా ప్రవేశించిందొక ప్రౌఢవనిత.

''ఈ శృంగారసీమ వీరి ఆధ్వర్యం లోనే నడుపబడుతూంది. పేరు ప్రియం

వద.'' మెల్లగా మిత్రుడి భుజం తట్టి చెప్పాడు మురళి.

వస్తూనే ఆవిడ చూపులు కలిగినింటి బిడలా అగుపడుతున్న హరనాథ్ మీద పడ్డాయి.

"వీ రెవరు?''

మురళి మిత్రుడిని పరిచయంచేశాడు. లక్ష్మీ పుత్రుడని తెలిసి ముఖం చాటంత చేసుకొంది. హరనాథ్ పాదాల నుండి శిరసుదాకా చేయి విసిరి ''ఈ మహారాజుకు ఈ దిష్టి బొమ్మలేం తగుతాయి? తగుతే తగాలి - మా అమ్మాయి నీలకాంతే తగాలి!'' అంది.

పెదవులు తడుపుకొన్నాడు మురళి. ''మీ కో కూతురుందని ఇప్పుడు తెలిసింది నాకు,'' బహుశః పెద్ద రేటులో ఉండి తనబోటివారి కంట బడలేదేమో అనుకున్నాడు.

ప్రియంవదను ఎగాదిగా చూచి జుగుప్సగా నవ్వుకొన్నాడు హరనాథ్. 'నువ్వో హిడింభిలా ఉన్నావు. నీ కూతురో చిన్న హిడింబిలా ఉంటుందేమో!....

"బి. ఎ. పరీక్ష వచ్చింది. ఈ కాలం కుర్రాళ్ళు చదువుకొన్న ఆడపిల్లలంటే ఎక్కువగా మోజు పడతారుగదా? అందు కనివాన్ని చదివించాను. ఇంకా ఈ వృత్తి లోకి దింపలేదు. అసలు పిల్ల కూడా అలాంటిదికాదు. కాని మీ మిత్రుడిని చూస్తూంటే ఈ దిష్టిపిడతల్లో దేన్ని అప్పగించడానికి మన సొప్పడంలేదు. బాబుగారు అనుమతిస్తే.... నా కూతుర్నే పువ్వులా మీదోసిట్లో పెడతాను.... దానికి ఈ సంగతులేవీ తెలియవు. బాబుగారే మచ్చిక చేసుకోవాలి.''

''సరి, సరి మా వాడు ఇలాంటి

మూలకాలు, సంయోగాలు, మిశ్రమాలు అంటే ఏమిటో వివరించుతూ స్పీడుగా చెప్పుకు పోతున్న కెమిస్ట్రీ లెక్చరర్ దృష్టి అపర కుంభకర్ణునిలాగ నిద్రపోతున్న గోపాలం మీద పడింది. అంతే!....ఆయన ఉగ్రుడై పోయి పోయి తాడెత్తున లేచి—

''గోపాలం! ...మూలకాలంటే ఏమిటి? మూల పదార్థాలకి ఉదాహరణ చెప్పు?... ''

నిద్రలో ఉన్న గోపాలం తెలివి తెచ్చుకొని యిలా జవాబిచ్చేడు—

''మూలన దాచబడిన పదార్థాలు మూల పదార్థములు సార్! ...మన చీపురు కట్ట... బూజులు దులుపుకర్ర వగైరాలు సార్!....''

—రామవరపు గిరిజాశంకరి, విశాఖ-1.

వాటికి కొత్త. గాటికి అలవాటు పడని గిత్తను పట్టిస్తానంటే ఎలా?''

''ఓ గంటలో మా అమ్మాయి వస్తుంది ఇక్కడికి. ఇంట్లో ఏం తోచడం లేదు. కాస్సేపు శరణాలయంవెళ్ళి కాలక్షేపం చేసి వస్తానంటూ అది తయారవుతూంటే నేను పరిగెత్తుకు వచ్చాను. చెప్పాను కదా, మా అమ్మాయికి ఇలాంటి సంగతులేవీ తెలియనీ లేదని.... వాణీ, మంజులా! జాగ్రత్త. బాబుగారిని శరణాలయం దర్శించడానికి వచ్చిన ఓ ఆఫీసరులా పరిచయం చేయండి. మరి నే వస్తాను. ఇంటిదగ్గర అది నా కారు కోసం ఎదురుచూస్తూ ఉంటుంది.'' చిన్న గున్నేనుగులా వడివడిగా వెళ్ళిపోయిందామె.

''పోదామా?' లేవబోయాడు హరనాధ్.

''కూర్చో. ఆమెను చూచిపోదాం''

''చూడడానికి ఏముందిలే?'' తిరిగి అస్థిమితంగా కూలబడ్డాడు. మురళితో వాళ్ళేవో సరసాలాడుతున్నారు, త్రుళ్ళుతున్నారు. ఆవేవీ చెవికెక్కడం లేదు జోరీగల మధ్య చిక్కినట్టుగా ఉంది ప్రాణం.

ఇంటి ముందు కారాగింది. మరుక్షణంలో గుమ్మంలో సాక్షాత్కరించింది, తళతళ లాడే జపాను జరీ చీరలో తెల్లగా మెరిసిపోతూ ఓ దేవకన్యలా. ఆ దేవత తనదిగా వాగ్దానం పొందడం వల్ల చాలా నిస్సంకోచంగా నిశితంగా పరికించాడు. నిలువెల్లా జారిపోతున్నా ఆమె సౌందర్యపు తళుకులను.

అపరిచిత యువకద్వయాన్ని చూచి సంకోచంగా ఆగిపోయింది ఆయువతి. నల్లపట్టి ఉన్న రిస్ట్‌వాచి కట్టిన చేత్తో చీర కుచ్చిళ్ళు అదిమిపట్టి, వేలికి ఉన్న ఉంగరంలో చిలుక పచ్చరాయి మెరుస్తూంది. చెవుల మీదికి జారిన ముంగురుల నుండి తీగలా అగపడుతూన్న బంగారు రంగుల జపాన్ జరీ మెరుపులతో పోటీ పడుతున్నాయి. శంఖులా ఉన్న మెడలో ఒంటి వరస బంగారు గొలుసు తళుకులీనుతూంది.

మంజుల అనే అమ్మాయి ముందుకు వచ్చి "రా, అక్కా, వీళ్లు మన శరణాలయం వివరాలేవో కనుక్కో పోడానికి వచ్చారట ఆ బాబుగారు ఓ లక్ష్మీపుత్రుడట. మన శరణాలయానికి పెద్ద మొత్తం విరాళ మిచ్చే ధర్మప్రభువుల్లాఅగపడుతున్నారు" అంటూనే ఓ చూపు వ్యంగ్యంగా మురళి మీదికి విసిరింది. "ప్రియంవద గారి పుత్రిక "నీలకాంతప్రభా" అంటూ పరిచయం కూడా చేసింది.

"నమస్కారమండీ." మర్యాదగా చేతులు జోడించి అక్కడే ఉన్న కుర్చీలో కూర్చోబోయిన నీలకాంత మంజుల సైగ అందుకొని లేచి ఆమె ననుసరించి పైకి వెళ్ళిపోయింది.

పది పదిహేను నిముషాల తరువాత క్రిందికి వచ్చిన నీలకాంత అక్కడ నిలువకుండా వెళ్ళిపోయింది.

హర్నాథ్ రూమ్‌కు వచ్చాడేగాని మన సంతా నీలకాంత మీద మోహంతో నిండి పోయింది. ఓ విధంగా పిచ్చి పట్టినట్టుగా తయారయ్యాడు.

అతడి అవస్థ చూడలేక ఓ రోజు, మురళి "రాయబారం నడిపేదా?" అని అడిగాడు నవ్వుతూ—ముందు ఎటపటాయించినా అంగీకరించక తప్పలేదు. తొలి వయసులో విరహం అలాంటిది. తిరిగి వచ్చిన మురళి, "ఆ అమ్మాయి ఊళ్ళో లేదట, వచ్చాక కబురు చేస్తానంది ప్రియంవద" అని చెప్పాడు.

మరో రెండు సార్లు మురళి ద్వారా ప్రయత్నించాడు గాని "ఊరినుండి రాలేదింకా" అన్నసమాధానమే వస్తూంది. "చూడబోతే ఆపిల్లను చూపకుండా ఊరించి ఎక్కువ గుంజాలని ఎత్తు ఉన్నట్టుంది," అభిప్రాయం వెలిబుచ్చాడు మురళి

నిర్లక్ష్యంగా చెప్పేశాడు హరనాథ్, "ఒక్కరాత్రి వెయ్యి పారేస్తానని చెప్పు. పైని ఇంకేం కోరినా ఒప్పుకొనిరా."

అక్కడికీ పని సానుకూల పడలేదు. "ఇహ ఆశ వదులుకో, భాయీ! పాపం, ప్రియంవద అందమైన కలలెన్ని గన్నదో గాని అన్నీ కూలద్రోసి నీలకాంత ఎవడితోనూ పరారయి పోయిందట."

మురళి తెచ్చిన వార్తవిని స్థాణువులా అయ్యాడు. కొన్ని రోజులు వెర్రిపట్టిన వాడిలా తిరిగాడు. తరువాత పరీక్ష పాసు

---

✻ భర్త:—ఏమిటే అది? కడుగా?

భార్య:—కాదండి. అది 'వనితా వాహిని'లో చూసి చేసిన పాయసం.

—వెలిచేటి శ్రీనివాసరావు, కాకినాడ.



కావడం, దూరప్రదేశంలో మంచి ఉద్యోగం వచ్చి వెళ్ళిపోవడంతో ఇంచుమించుగా నీలకాంతను మరిచిపోయాడు. అప్పుడప్పుడు ఆ వెరి వాంఛ గుర్తు వచ్చినప్పుడల్లా 'ఛీ ఛీ! ఎంత పొరపాటు జరిగిపోయేది?" అనుకొంటాడు.

* * *

హరనాధ్ దోసిట్లో ఉన్నది ఏదో ఒక చిత్తరువు కాదు, తన ముఖంలోకి దీక్షగా గుచ్చి చూస్తూంటే రెప్పలు ఎత్తడానికి సాధ్యం కాలేదు సావిత్రికి. అతడి చేతుల నుండి మృదువుగా ముఖం తప్పించి—

''ఇప్పుడైనా ఒప్పుకొంటారా నేను సావిత్రినని?'' అంది.

''ఉహుఁ.... ఒప్పుకోను. నువ్వు నీలకాంతవే!'' దృఢంగా అన్నాడు.

''నిజంగా మీకు పిచ్చే పట్టింది. కాకపోతే ఏమిటీ సతాయింపు? నీలకాంత మీద మీ ప్రేమ బంగారంగాను! నా వెంట పడ్డారేమిటీ?''

''ప్రేమించ లేదు. ఒక రాత్రికి వెయ్యి రూపాయలిస్తానన్నాను.''

''అమ్మో! మంచి సచ్చరితులేనన్న మాట.'' మందహాసంచేసింది. ''ఇంతకూ మీ నీలకాంత కథ చెప్పరూ?''

''ఓ! తప్పకుండా.'' కిటికీ చెంతకు వచ్చాడు. ఆడవి మొల్లనిండా మల్లెగుత్తులు

విచ్చుకొని పరువంతో విగ్రవీగుతూంటే తమకంతో వాయుదేవుడు ఊపి ఊపి నలుపుతున్నాడు.

వంగి ఐదారు మల్లెలు దోసిట్లోకి తీసుకొని ముక్కుదగ్గరకు చేర్చి గుప్పున పీల్చి— "ఓ మబ్బు పట్టిన రోజు" అంటూ ప్రారంభించాడు, ఓరగా నిశితంగా సావిత్రి ముఖభంగిమలు గమనిస్తూనే.

* * *

నల్లని చీకటి దొడి తలుపు గడియమీద ఓ సుకుమార హస్తం పడీ పడకముందే మోటుగా మరొక చేయి వచ్చి పడింది.

"నీలకాంతః" గంభీరంగా వినిపించింది హరనాథ్ కంఠం.

"‥ …. ‥ …"

"ఇప్పుడైనా నిజం చెప్పు. నీలకాంతవే కదూః"

"… ‥ …. …"

"ఎందుకింత మోసానికి సాహసించావుః నీ ఎత్తుకు రాజమ్మణ్ణి ఎలాసహకరించిందో బోధపడ్డంలేదు. నయవంచనతో నక్కవినయాలతో అమ్మ మనసు ఎంతగా దోచుకొన్నా నువ్వు బ్రాహ్మణ పిల్లవు కావని తెలిసిన రోజు నడి ఇంట్లో గోయి తీసి పాతే యించగలదు."

"హరనాథ బాబూః" ఇంచుక కటుదనంతో శాసిస్తున్నట్టు అంటూన్న సావిత్రి కంఠం విని నివ్వెరపోయాడు. రహస్యం బయట పడ్డందుకు తన కాళ్ళమీదపడి ప్రాధేయపడుతుందనుకొన్నాడు. కాని ఇదేమిటిః

"మీ తెలివి తేటల మీద అంత నమ్మకం పెట్టుకోకండి. మీకు పట్టిన నీలకాంత పిచ్చివల్లే భయపడి పారిపోతున్నాను. ఏ దుర్బలక్షణం మీ నీలకాంత మీద పిచ్చి విజృంభించి నన్ను కబళించడానికి వస్తుందోనని. అంతేగాని నా రహస్యం ఏదో బయట పడిపోయిందని కాదు. నేను బ్రాహ్మల పిల్లను అవునో కాదో తేల్చుకోవాలని ఉంటే కుమ్మెరకు వెళ్ళండి. అక్కడ మా అమ్మ నాన్న

---

● తోటి ప్రయాణీకుడు పొగ తాగటం ఆమెకు దుర్భరమైంది. పొగ తాగటంవల్ల వాచ్చే కీడుల్ని ఏకరువు పెట్టింది.

"నేను నా పదహారో ఏటి నుంచీ పొగ తాగుతున్నాను. ఒక్క రోజు కూడా బ్రరున చీదలేదు. ఇప్పుడు నా వయస్సు ఎనభై. దీనికి ఏమంటారుః" అన్నాడతను.

"పొగ తాగకుండా ఉన్నట్లయితే యిప్పటి మీ వయస్సు తొంభై ఐ ఉండేదిః" అన్నదామె,

లేరు గాని— మా పిన్ని— మానవి తల్లి ఉంది. 'నేనెవరో చెబుతుంది''

హతాశుడై పోయాడు హరనాథ్. అంత దృఢంగా పలుకు తూంటే బుకాయిస్తూందని అనుకోలేక పోయాడు. కాని, ఈ సావిత్రి అచ్చుగుద్దినట్లు నీలకాంత పోలికలో ఉండడమేమిటి? అలంకరణా అదీ స్థానాన్ని బట్టిమారిపోయి ఉండవచ్చు కాని అదే మనిషి!

''ఎప్పుడో రెండేళ్ళ క్రితం కొద్ది క్షణాలు మాత్రమే చూచిన నీలకాంత నా మాదిరిగా ఉంటుందని పంతం పట్టి కూర్చొన్నారు. మీ పిచ్చి వింతగావుంది.''

''రెండేళ్ళ క్రితం చూచినా, రెండు వందల సంవత్సరాల తరువాత చూచినా, మరో రెండు వేల జన్మల తరువాత చూచినా ఆమెను గుర్తు పట్టగలను. గాఢంగా చూచిన ఆ ఒక్క క్షణమే చాలు. ఆమె రూపం నాలో సుస్థిరంగా ముద్రపడిపోయింది.'' ఏదో తన్మయతతో చెబుతూ ఆగిపోయి—''ఇదేదో నీకు ప్రేమ పిచ్చి కవిత్వంలా వినిపించవచ్చు పోనియ్యి నీలకాంత గొడవ. నువ్వు సావిత్రివే. ఇంట్లోకి పద. నువ్విప్పుడు పారిపోతే నేనేదో నిన్ను చేయబోయానని కథ అల్లగలరు జనం. హామీ ఇస్తున్నాను.

నావల్ల నీకే భయమూ రానివ్వను. అసలు వారం రోజులకంటే ఎక్కువుండనిక్కడ. నీ ఆధారం పోగొట్టిన పాపం నాకెందుకు అనవసరంగా? పద-పద. ఇంట్లోకి....'' అంటూ, సావిత్రి చేతిలోని సంచీ లాక్కొని దారి తీశాడు.

## 3

కొడుకు సెలవు అయి వెళ్ళిపోయేలోగానే ఏదో ఒక సంబంధం కుదిర్చి పెళ్ళి చేసి పంపాలని ఉబలాటంగా ఉంది కళ్యాణికి. దూరప్రాంతంలో ఉన్నాడు. జంట లేనివాడు (వయసు మహాచెడ్డది)

ఆరెండు మూడు రోజుల్లోనే పిలిచి నట్టుగా ఓ సంబంధం వచ్చింది. మారు చెప్పకుండా పెళ్ళి చూపులకు పయనమైంది కళ్యాణి. కొడుకు ఇప్పుడు కాదు కాదం టున్నా వినకుండా. ఇహపోరు పడలేక— ''నువ్వెళ్ళి చూడిరా'' అన్నాడు హరనాథ్.

సావిత్రిని కూడా పిలిచింది, ''ఈ కాలం పిల్లల ఎన్నికలే వేరుకదా? నువ్వూ చూద్దువురా'' అంటూ. సావిత్రి ఇష్టాయిష్టాలతో నిమిత్తమేముంది.? యజమానురాలి ఆజ్ఞ!

ఉమాపతిరావుగారితో సరితూగగల సంబంధమే. పిల్ల విద్యావతి. మెచ్చదగిన అందగత్తె కొడుకు చూచినా వంక పెట్ట డానికి ఏమిలేదు. తప్పక ఈ సంబంధం కుదరగలదన్న నమ్మకంతో పట్టలేని ఆనం దంతో తిరిగి వచ్చింది, కళ్యాణి.

కాని, కొడుకు మూర్ఖత ఆమె ఆశలన్నీ చెదరగొట్టాయి. ససేమిరా ఇప్పుడు పెళ్ళి చేసుకోనంటాడు. మన సంబంధం వాళ్ళకు కావాలనుకొంటే రెండు సంవత్సరాలు ఆగి రమ్మన్నాడు.

ఇదేమిటో బోధపడడంలేదు కళ్యాణికి. 'కొంపదీసి అక్కడెవరికైనా మనసిచ్చాడా ఏమిటి.' అనుకొందామె కలవరంగా

''పిల్ల ఎంత చక్కనిది? పెద్ద-పెద్ద కళ్ళు—అంత కళగల ముఖం ఎక్కడా చూడలేదు.'' కొడుకులో ఉత్సాహం కని పించక, ''ఏమే, సావిత్రీ! పిల్ల చాలా బాగుంటుంది కదా? నువ్వు చెప్పు. ఎంత అందంగా ఉంటుందో ఆ అమ్మాయి ...'' అంది ఊరిస్తూ.

సావిత్రి ముసి-ముసిగా నవ్వింది ''నిజం. అంత చక్కని పిల్లలు చాలా అరుదు. అదృష్టం కావాలి అంత అంద

---

✻ విపరీతమైన లావెక్కిన ఆవిడ ''ఈ మధ్య చాలా భయంగా ఉంటోంది. నా నీడను చూసే నేను భయపడుతున్నాను'' అన్నది డాక్టర్‌తో.

''సహజమే మరి! మీ గొడుగు చూస్తే ఒక గుంపు వెంటాడుతూన్నట్లని పిస్తుంది!'' అన్నాడు డాక్టర్.



మైన సాహచర్యం లభించడానికి....'' అంది.

''వెటకరించడం కూడా వచ్చు ఈవిడకు!'' కోపం వచ్చింది హరనాథ్‌కు. ''అమ్మా, సావిత్రి అందంగా లేదూ?'' అన్నాడు.

తల్లి కంగారు పడింది. సావిత్రిని ఓ లజ్జా తరంగం ఢీకొట్టడం వల్ల అక్కడి నుండి పారిపోతుంటే అతడి మాటలు వినిపించాయి.

''మన యింట్లో వంట చేసే మనిషే ఇంత అందంగా ఉంటే మన యింటికి కోడలిగా రాబోయే ఆవిడ ఎంత అందంగా ఉండాలంటావు?''

కొడుకు వచ్చినప్పటి నుండి మాటి-మాటికి సావిత్రి అందం ఎత్తి చెప్పడంతో చిరాకనిపించింది కళ్యాణికి. 'వీడు యుక్తాయుక్తాలు విస్మరించే అంధు డౌతున్నాడా ఆ పిల్ల అందం చూచి! ఏవో సాకు ఎన్ని తన పుట్టింటికో, చెల్లెలి దగ్గరికో ఓ రెణ్నెల్ల పాటు సావిత్రిని పంపడం క్షేమమా?' అలా ఆలోచించి కూడా తిరిగి తమాయించుకొంది. కొడుకు సంగతి తనకు తెలుసు. గౌరవ హోదాలకు, అంతస్తు దర్పాలకు ఎన్నడూ హాని రానిచ్చేవాడు కాదు. యవ్వన సహజంగా ఓ వివశమైన ఆకర్షణకు లోబడవచ్చు. అది పెళ్ళిదాకా పోనిచ్చే అవివేకి మాత్రం

కాదు.... అజాగ్రత్తతో చెయ్యి యిస్తే ముప్పు తెచ్చుకొనేది సావిత్రే. దానికి ఎవరి బాధ్యతా ఉండదు. అంత యిదే వస్తే నీకూ, నీ పిల్లలకూ తిండీ, గుడ్డా పడేస్తాం పడి ఉండమంటుంది.

"అమ్మా-అమ్మా!" అంటూ హృదయమంతా అప్పగించి కపటం లేకుండా ప్రవర్తించే సావిత్రికి ఆ అమ్మగా పిలువబడే ఆమెలో యింత కుచ్చితపు ఆలోచన ఉండగలదని ఎలా ఊహించగలదు?.... అయితే, కొడుకు వచ్చేదాకా ఆవిడలో అంతటి పాపపు తలంపు జొరబడడానికే అవకాశం లేదు. స్వచ్ఛంగా, హృదయస్ఫూర్తిగానే "సావిత్రీ, సావిత్రీ" అంటూ ప్రతి దానికీ సావిత్రిని పిలుస్తూ, ఆమె సలహా తల దాల్చవలసిందే.

## 4

మధ్యాహ్నం ఎండ మనుషుల్ని తోచనీయడం లేదు.

పడుకొంటే నిద్ర పట్టదు. ఒంట్లో చెమటలు కారిపోతుంటే ఏమిటో బద్ధకంగా, అలసటగా, చిర-చిరగా ఉంది. పక్కమీద దొర్లే కొద్దీ యింతేనని లేచి క్రిందికి వచ్చాడు హరనాథ్.

"సావిత్రీ, కొంచెం మంచినీళ్లు!"

సావిత్రి జాడ లేదు. కొడుకు కేక విని తల్లి వచ్చింది. "మంచినీళ్లు కావాలా, హరీ?"

"ఉఁ.... సావిత్రి లేదూ?"

"దొడ్లో గొడ్లపాకలో ఉందేమో!"

"అక్కడెందుకుంది!"

"వడ్ల కమ్మర్ల పిల్లల్ని పోగేసుకొని చదువు చెబుతూ ఉంటుంది. మధ్యాహ్నం ఓ రెండు గంటల సేపు అక్కడ."

"అమ్మో, పాఠాలు చెప్పే చదువొచ్చా?"

"సావిత్రి తండ్రి మేష్టారు పనిచేసే వాడట. ఇంట్లో ఆ పిల్లకు ఎన్నో సంగతులు చెప్పేవాడట. బళ్లో సెవెంత్ క్లాసు వరకూ చదివించాడట కూడా. చాలా తెలివైన పిల్ల. అదృష్టం ఒకటి తక్కువుంది గాని."

"ఉహూఁ!" తల్లి మంచినీళ్ళు యిస్తే తాగి గొడ్లపాక వైపు దారి తీశాడు.

"నల్లనివాడు.... ఎవరు? కృష్ణమూర్తి. కృపారసం పైజల్లెడువాడు... కృపారసం అంటే దయాగుణం, పైజల్లెడువాడు.... నవ్వు రాజిల్లుమోము వాడొకడు చెల్వల మానధనంబు దోచెనో మల్లియలార...."

ఆగిపోయింది సావిత్రి. ఎదురుగా చూరుక్రిందికి వచ్చి నిలబడిన హరనాథ్‌ను చూచి.

"చాలా శ్రావ్యంగా పాడుతున్నావు. సంగీతం వచ్చు కదూ?"

"ఏదో కొద్దిగా, మా నాన్న నేర్పించేవాడు. కొంచెం పెరిగి పనీ పాట అందు

కోవడం మొదలు పెట్టాక మా పిన్ని ఏదీ సాగనివ్వలేదు. కాని, నాకు చదువన్నా, సంగీతమన్నా చాలా జిజ్ఞాసగా ఉండేది. పిల్లలంతా అన్నాలు తినేసి పడుకొన్నాక 'పిన్నీ, పనేం లేదా?' అని అడిగి ఆవిడ చదువుకొమ్మంటే అప్పుడు దీపం ముందు కూర్చొనే దాన్ని.''

''ఓ! నువ్వు చాలా కష్టాలు పడ్డావన్న మాట? నీ సవితి తల్లి నలుచుకు తినేదా? ఒక్కొక్కటీ అడిగితే లాభం లేదు. నీ కథంతా చెప్పు అభ్యంతరం లేకపోతే. మీ నాన్న ఉన్నాడా యిప్పుడు?''

''అక్కడ నిలబడే వుంటారా? లోపలికి రండి.''

గొడ్లపాక అయినా విలక్షణంగా ఉంది లోపల. వర్షాకాలమైతే రొచ్చు-రొచ్చుగా ఈగలు, దోమలు ముసురుతూ అసహ్యంగా ఉంటుంది గాని వేసవి కాబట్టి అంతా ఆరిపోయి పేడ వేసి అలికినట్టుగా ఉంది.

పక్కకు ఓ మూరెడెత్తుగా ఓ మనిషి పడుకోడానికి అరుగు సామాన్యంగా జీతగాడు పడుకొంటూ ఉంటాడు దాని మీద. సావిత్రి పిల్లలకు పాఠాలు చెప్పడానికి అధిష్ఠించే ఉచ్ఛస్థానమదే. క్రింద ఈత చాప మీద పది-పన్నెండు మంది పిల్లలు ఉన్నారు. ఇద్దరు తప్ప అంతా ఆడపిల్లలే. ఒకరిద్దరు పన్నెండు-పదమూడేళ్ళలో ఉండే అమ్మాయిలు కూడా ఉన్నారు. అప్పుడే ఓ పిల్లకు పెళ్ళయినట్టుంది కూడా. కాలి వేళ్ళకు యింకా కొత్తదనం పోని వెండి మట్టెల చుట్లు మెరుస్తున్నాయి.

అరుగు మీద గోనెపట్టా దులిపి వేసి ''కూర్చోండి.'' అని చెప్పి తను చాప మీద చతికిల బడింది పిల్లల పక్కగా. పెళ్ళయిన పిల్లా, మరో పిల్లా హరనాథ్ ఎదుట కూర్చోవడం సిగ్గుగా తోచి, ''రేపొస్తాం, పంతులమ్మా!'' అంటూ వెళ్ళిపోయారు.

ఆ గోనెపట్టా మీదే అడ్డం ఒరిగి తల క్రింద చేయి పెట్టుకొన్నాడు హరనాథ్. ''చల్లగాలి బాగా వస్తుందే యిక్కడికి! అందుకే మధ్యాహ్నం యిక్కడ చోటు చేసుకొన్నావన్న మాట!''

''ఇంట్లో కంటే నయం. మిద్దె కాక. గోడల కాక ఉండవు. తాటికమ్మల కప్పు క్రింద....ఊఁ, ఎక్కడి నుండి మొదలు పెట్టేదబ్బా?'' బుగ్గన వేలుంచుకొంది సావిత్రి.

''పుట్టినప్పటి నుండి....'' అన్నాడు నవ్వుతూ.

[సశేషం]

---

ఎవరైనా నీ సలహా కోరాడంటే సాధారణంగా అతడు నీ నుండి పొగడ్తను ఆశిస్తాడు.

—చెస్టర్ ఫీల్డ్

---



# సాక్ష్యం

బొమ్మిరెడ్డిపల్లి సూర్యారావు

సముద్ర పొద్దున గుట్టల మధ్య లైట్‌హౌస్‌లాగ ఆగ్రామంలో రాళ్ళ కొండలమధ్య గవరయ్య నాయుడి మేడ చాలదూరం నుంచే కనిపిస్తుంది. నాయుడంత మేడ ఎలా కట్టేడని అడక్కూడదు. అడిగితే ఇటుకలూ, సున్నం, సిమెంటూ వేసి కట్టేడంటారు. ఆ ఇటుకలూ, సున్నం ఎలా వచ్చాయంటే డబ్బిస్తే వచ్చాయంటారు. ఊళ్లో తక్కిన వాళ్ళందరికీ రాని డబ్బు నాయుడికెలా వచ్చిందని అడిగితేనే వస్తుంది పేచీ. నాయుడి పాతికెకరాల పొలం ఏభై ఎకరా లెలా అయింది, ఏభై ఎకరాలు నూరెకరా లెలా అయాయి, మిద్దె కొంప మేడగా ఎలా మారింది, పంచాయితీ బోర్డు ప్రెసి

దెంటు నుండి ఎమ్మెల్లే ఎలాగయాడు అనడిగితే పేచీ లేకుండా ఒక్క ముక్కలో సమాధానం చెప్పొచ్చును. నాయుడి అదృష్టం బాగుందని. గ్రామంలోని మూడు-నాలుగు వేల జనంలోనూ నాయుడొక్కడే అదృష్టవంతుడు. నాయుడి అదృష్టం పచ్చని చెట్టులాగ చిలవలు పలవలతో మేడంత ఎత్తు పెరిగింది. ఊళ్లో చాలవరకు రైతులు నాయుడికి పంట అమ్మిన వాళ్ళు. నాయుడి దగ్గర అప్పులు తీసుకున్న వాళ్లూను. భూమి లేనివాళ్ళంతా నాయుడి పొలంలో పాలేర్లుగా పని చేసిన వాళ్ళే. వీళ్ళందరి దురదృష్టం ఊదినకొద్దీ వుబ్బిపోయే రబ్బరు బెలూన్‌లాగ ఏళ్ళు గడిచినకొద్దీ పెద్దదయింది.

కాని ఊళ్ళో వాళ్లెవరికీ యిది విచిత్రంగా కనిపించ లేదు. అంతమందిలోనూ ఒకడే అదృష్టవంతుడయితే ఆశ్చర్యమేముంది అందరూ అదృష్టవంతులైతేనే ఆశ్చర్యం గాని. నాయుడెమ్మెల్లే అయితే ఆశ్చర్యమేముందీ, యింకే ముష్టి వెధవో అయితే ఆశ్చర్యం గానీ. నాయుడు ఎలక్షన్లలో అభ్యర్థిగా నిలబడినప్పుడు ఎవడినీ ఓటు కోసం అభ్యర్థించలేదు. నాయుడి ఏజంట్లు యింటి యింటికీ వెళ్ళి ఓటు నాయుడికి కాక అపోజిషను వాడికిచ్చినట్లయితే మర్యాద దక్కదని బోధ పరిచి వచ్చారు. నాయుడు మాత్రం రెండు బహిరంగ సభలు పెట్టి మాట్లాడేడు. తను కారణజన్ముడననీ, ప్రజాసేవ కోసమే పుట్టేననీ చెప్పేడు. ఊళ్లోకి ఎలెక్ట్రిక్ లైట్లు తీసుకొస్తాననీ, రోడ్డు వేయిస్తాననీ చెప్పేడు. ఇలా రెండు బహిరంగ సభలతో ఎమ్మెల్లే అయాడు. అయి, రోడ్డు వేయించాడు, ఎలెక్ట్రిక్ తీసుకొచ్చాడు. రోడ్డువల్ల ఎమ్మెల్లేగారి కారు ఎకాయెకిని మేడ వరకూ వచ్చేస్తుంది. ఎలెక్ట్రిక్ దీపాలు నాయుడి మేడ నిండా వెలిగాయి. వీధి గుమ్మంలో పెట్టిన గొట్టం దీపాల వెలుతురు ముందు కిరసనాయిలు దీపాలేమిటి నిలబడగలవు?.... నాయుడి పలుకుబడిలాగే దానికి మరి తిరుగు లేదు.

**అంచల వారీగా అదృష్టం ఆవహిస్తున్న అదృష్టవంతుణ్ని అదెలా వచ్చిందని అడగటం అవివేకం!**

**బడి పంతులుకూడా పరువనేది వుందా ?!**

చెప్పొచ్చేదేమంటే ఆ వూళ్లో ఓట్లన్నీ నాయుడికే పడ్డాయి కానీ, ఒకే ఒక ఓటు అపోజిషన్‌కి పడింది. తులసి వనంలో గంజాయి మొక్కలా ఎవడా ఏకైక అపోజిషన్ సపోర్టరని నాయుడు ఆరా

తీయించేడు. ఎవడో కాదు ఊళ్లోవి ఎలిమెంటరీ స్కూలు హెడ్మాస్టరు రామారావు. నాయుడికి కోపంతో ఒళ్ళుమండి పోయింది.

"ఏట్రా ఎంకయ్యా. అణా కానీ ఇలువ చేసే బడి పంతులు మనకపోట్టీ జీషనా? ఈ నాయుడంటే ఏటనుకున్నాడేటి? ఇరణ్యకసిపుడ్రా నాయనా, రావణాసురుడు. పగ పట్టినాడంటే నాగుపామే. ఆడో మనమో ఎవడో ఒకడే మిగలాలి తెలుసా? అంతేనంటావా? ఏట్రా నంజికొడకా, మాట్లాడవేం?" అంటూ తన సపోర్టరు వెంకయ్య ముందు శివాలెత్తేడు నాయుడు.

"అంతే బాబూ, అంతే! బడి పంతులేటి, తమతో ఇరోదమేటి! కలికాలం కాకపోతే మరేటి బాబూ!" అని ఒక చిన్న వేదాంత వ్యాఖ్యానం చేశాడు వెంకయ్య.

"నా తడాఖా ఆడికి తెలీదు కాబోల్రా. ఊళ్లో మంచినీళ్ళు పుట్టకుండా చేస్తాన్రోయ్. ఉద్యోగం పీకించేస్తాను. అడుక్కున్నా ఊళ్లో పిడికెడు మెతుకులేనా ఎవడూ వెయ్యకుండా చేస్తాన్రా. ఏటనుకున్నాడో ఏటో. పోయి చెప్పరా నంజికొడకా, చెప్పు," అంటూ నాయుడు చిందులు తొక్కేడు.

వెంకయ్య యీ విషయమంతా పూసగుచ్చినట్లు రామారావుతో చెప్పేడు. "బాబూ, తమరేమో సదువుకున్నారు. నాయుడికేమో చిత్తుగా డబ్బుంది, పలుకుబడుంది. అటు పోయి ఆఫీసర్లందరినీ కట్టుకు రాగల్డు. డబ్బుంటే దెయ్యం కూడా జడుస్తాది. కొండ మీది కోతి దిగొస్తాది. ఏటి సేస్తాం, యీ కాలమలాంటిది బాబూ! కలికాలం...." అంటూ తన ప్రసంగం ముగించాడు వెంకయ్య.

రామారావుకి నవ్వొచ్చి పకపక నవ్వేశాడు. నాయుడు రామారావుని సర్వనాశనం చేస్తానన్నాడంటే ఈయన నవ్వుతాదేమిటా అని ఆశ్చర్యపోయాడు వెంకయ్య

---

❋ "బలిసి ఉన్నావు. పని పాటలు చేసుకోక యీ అడుక్కోవటమేమిటి?" అన్నది యిల్లాలు బిచ్చానికి వొచ్చిన వాడితో.

బిచ్చగాడు ఆమెను తేరిపార జూచి "ఎంతో అందంగా ఉన్నారు. సినిమా నటి కాదగినవారు. మరి యీ విధంగా వంటింటి కుందేలల్లే ఉండటం దేనికి?" అన్నాడు.

"ఉండు... ఏమైనా ఉన్నదేమో చూస్తాను!" అని ఆ యిల్లాలు యింట్లోకి వెళ్ళింది.

ఇది కూడా కలికాల మహిమే అయి వుంటుందనుకున్నాడు.

"వెంకయ్యా. డబ్బుకు దెయ్యం జడుస్తుందేమో కానీ నేను మాత్రం భయపడనయ్యా! నా సంగతి మీకు తెలీదు. నేనో మొండి ఘటాన్ని. నాయుడు నాకేమైనా అపకారం చేశాడంటే ఊళ్లో రైతులందరినీ కూడదీసి నాయుడి మీదికి ఉసిగొల్పుతాను. తెలిసిందా!" అన్నాడు రామారావు.

రామారావు దరాగా ఊళ్లో తలెత్తుకుని తిరుగుతున్నాడు. ఊళ్లో అందరూ రహస్యంగా రామారావుని మెచ్చుకోవడం మొదలు పెట్టేరు. నాయుడంతటి వాడ్ని ఎదిరించి నిలబడిన వాడు 'వీ(డా మొగాడంటే' అన్నారు. నాయుడు రామారావుని ఏదో దెబ్బ కొట్టకపోతే అతడి పరువు పోతుంది. రామారావు హీరో అయిపోతున్నాడు.

కాబట్టి నాయుడు జిల్లా పరిషత్తు అధికారుల్ని కలుసుకుని రామారావుకి ట్రాన్స్‌ఫర్ ఆర్డరు వేయించాడు. కాని రామారావు లొంగలేదు. ఒక ఎంపీని పట్టుకుని అతని ద్వారా పై అధికారులకి చెప్పించి ఆ ఆర్డరు కేన్సిలు చేయించాడు.

నాయుడికి మరీ ఒళ్ళు మండింది. ఈ సమస్య అధికారుల స్థాయిలో పరిష్కారమయేది కాదనీ మంత్రుల స్థాయికి తీసుకెళ్తాననీ చెప్పేడు. అలా అయితే నేను ప్రధాన మంత్రి స్థాయికే వెళ్తానన్నాడు రామారావు. ఇలా యిద్దరి మధ్య విరోధం దిన-దిన ప్రవర్ధమానమవుతుండగా ఒకరోజు ఏం జరిగిందంటే—

నాయుడు కొడుకు ఎనిమిదేళ్ళ వాడు' మరొక యిద్దరు పిల్లవాళ్ళతో కలిసి చెరువొడ్డుకు ఆటకు వెళ్ళేడు. పిల్లవెధవలు చెరువుగట్టు మీద నిల్చుని నీళ్ళలోకి రాళ్లు విసురుతూ ఆడుతున్నారు. చెరువునీటిలో పడిన సాయంత్రపు సూర్య కిరణాలు పిల్లలు విసిరిన రాళ్ళకు చెదిరి కత్తుల్లా మెరుస్తూన్నాయి. రాళ్ళు పడిచిన చోట ఎన్నో చక్రాలు ఏర్పడి యింటికి వెళుతున్న సూర్యుడి రథచక్రాల్లా కనిపించి పిల్లల ఉత్సాహాన్ని మరింత ఎక్కువ చేశాయి. ఒకటి-రెండు రాళ్ళు తామర పువ్వులకు తగిలి వాటి రెక్కలు విరిగేయి. చింతచెట్టు మీదికి రాళ్ళు విసిరితే చింత కాయలు పడతాయి, కాని రాళ్ళ దెబ్బలకి తామరపువ్వులొచ్చి పడవు. పిల్లలు రాళ్లు విసరడం మాని తామర పువ్వులు తెంపాలని నీటి ఒడ్డు కెళ్ళేరు. నాయుడి కొడుకు కొంచెం సాహసించి నీళ్ళల్లో రెండడుగులు వేసి దగ్గరలో వున్న పువ్వును అందుకో బోయాడు. ఒక్క క్షణంలో కాలు జారి 'అమ్మో' అని కేక వేసి నీళ్ళలో మునిగి పోయాడు. పిల్లలిద్దరు "అమ్మో-అమ్మో" అని కేకలేసి ఏడుస్తుండగా చెరువు గట్టంట వెళుతున్న రామారావు ఆ కేకలు విని గబ-గబా పరుగెత్తుకుని వచ్చి నీళ్ళలోకి దూకి పిల్లవాడ్ని బయటికి లాగేడు. తనకు తెలిసిన ప్రథమ చికిత్స చేసి మొత్తంమీద పిల్లవాడ్ని బ్రతికించాడు. నాయుడింటికి తీసికెళ్ళి వదిలిపెట్టేడు. ఆ సమయంలో నాయుడింటిదగ్గర లేడు ఆయననింటి కొచ్చాక ఆడవాళ్ళు జరిగిన కథంతా చెప్పారు.

నాయుడు తన భార్యమాటలను నమ్మలేకపోయాడు. రామారావు తన పిల్లవాడ్ని బతికించడ మన్నది అసంభవం. నాయుడికి మనుషుల అజ్ఞానంలో నమ్మకముంది కాని. వాళ్ళ మంచితనంలో నమ్మకం లేదు. పెళ్లాం, తల్లి, స్నేహితులు విరోధులు అందరిలోనూ ఎంతో కొంత దుర్మార్గ ముంటుందనీ, అందరూ ఎంతో కొంత అబద్ధమాడతారనీ అతని నమ్మకం పైగా రామారావులో మంచితనముందంటే ఎలానమ్మడం? ఇందులో ఏదో మోసం వుండితీరుతుందనుకున్నాడు. వెంటనే పోలీసులకి రిపోర్టిచ్చాడు. తన మీద విరోధంతో తన కొడుకుని రామారావే నీళ్ళలోకి తోసేడనీ. నలుగురు చేరగానే తన నేరం కప్పిపుచ్చుకోడానికి నీళ్ళోకి దూకి పిల్లవాడ్ని బయటికి తీసేడనీ ఫిర్యాదు చేశాడు.




రామారావుని పోలీసులొచ్చి పట్టుకు పోయారు. ఇది హత్యాప్రయత్నం కాబట్టి బెయిలివ్వకూడ దన్నారు. కాని జడ్జిగారు ఆర్గ్యుమెంట్లన్నీ విని బెయి లిచ్చేశారు.

నాయుడుగారు తలచుకుంటే సాక్ష్యాల కేం కొదవలేదు. తన పిల్లవాడికి వాడితో బాటు ఆటకు వెళ్ళిన యిద్దరు పిల్లలకీ సాక్ష్యం ఎలా చెప్పాలో అంతా కాగితాల మీద వ్రాసి కంఠోపాఠం పెట్టించాడు. వాళ్ళకి ఫుట్‌బాల్ కొనిస్తానని ఆశ పెట్టేడు. తను చెప్పినట్లు చెప్పకపోతే చితక తంతానని బెదిరించాడు.

కేసు విచారణలో పెద్దలందరూ రామారావు దుర్మార్గాన్నిగూర్చి చక్కగా సాక్ష్యమిచ్చారు. పిల్లలుకూడా కంఠోపాఠం పెట్టినదంతా ఒప్పచెప్పేరు. కాని క్రాసెగ్జామినేషన్‌లో తడబడిపోయారు. పిల్లలు కాబట్టి తడబడ్డారని ప్రాసిక్యూషన్‌వా రన్నారు. రామారావుకి సాక్షులు లేరు. అతనికి పిల్లల నిజాయితీమీద నమ్మక ముంది. అతను కోర్టువారితో చెప్పిన పాయింటు ఒకటే.

"నేను పదేళ్లగా ఉపాధ్యాయుడుగా వున్నాను. పిల్లల మనస్తత్వం నాకు తెలిసినంతగా యిక్కడున్నవారి కెవరికీ తెలియదు. ఆ విషయం యీ కోర్టులో స్పష్టమైంది. పిల్లలు స్వతహాగా నిజాయితీపరులు. అబద్ధాలాడరు. వారికి తెలిసిన నిజాన్ని జంకు లేకుండా తడబడకుండా చెబుతారు. కాని వాళ్ళకి పెద్దలే అబద్ధాలాడడం, మోసాలు, దగాలు మప్పుతారు. కొత్తగా నేర్చుకునే అబద్ధాలు సరిగ్గా, నిలకడగా చెప్పలేక తడబడతారు. కాబట్టి జడ్జిగారు వాళ్ళని పోలీసులూ

పెద్దల సమక్షంలో కాకుండా వారి ఛేంబర్ లోకి పిలిచి, వారికి పూర్తిగా అభయమిచ్చి, వాళ్ళని నార్మల్ మూడ్ లో పెట్టి నిజం తెలుసుకోమని కోరుతున్నాను. నేను పేద ఉపాధ్యాయుడ్ని కాబట్టి అబద్ధాలాడవచ్చును. దుర్మార్గుడ్ని కావచ్చును. ధనవంతు లందరూ నిజాయితీపరులు కావచ్చును. ఈ సూత్రం మీద నన్ను శిక్షించదలచుకుంటే నేను చేసేదేమీ లేదు. కాని న్యాయం కావాలనుకుంటే నేను చెప్పిన పద్ధతిలో పిల్లల్ని అడిగి నిజం తెలుసుకోండి.'' అన్నాడు రామారావు.

జడ్జీగారికి ఈ సలహా నచ్చింది. కోర్టు ఆ వేళకి ముగిసిందని మాత్రం చెప్పి, పిల్లల్నిమాత్రం తన ఛేంబర్ లోకి తీసుకు వెళ్ళేరు. మిఠాయిలూ, కూల్ డ్రింకులూ తెప్పించారు. వాళ్ళకి కొన్ని పిట్టకథలు చెప్పి, నవ్వించి మంచి మూడ్ లో పెట్టి చెరువుదగ్గర జరిగినదంతా చెప్పమన్నారు. ముగ్గురూ నిజం చెప్పేరు. రామారావు మాష్టరుగారు చాలా మంచివారనీ, ఆయనకి ఈత బాగావచ్చుననీ ఆయనక్కడికి రాకపోతే నాయుడుకొడుకు నీట్లోంచి మరి బయటికి రాలేడనీ చెప్పేరు. నాయుడు కొడుక్కూడా నిజం చెప్పేడు. జడ్జిగారితో అతనిలా చెప్పినట్లు తండ్రితో చెప్పొద్దన్నాడు. చెబితే నాయుడు తంతాడన్నాడు.

జడ్జీగారు కేసు కొట్టేశారు. పైగా జడ్జిమెంటులో ప్రాసిక్యూషన్ వారిని చీవాట్లు పెట్టేరు. ఆ చీవాట్లేమిటో మీకు తెలుసు. మరి వేరే చెప్పడమెందుకు?

''నేను నమ్మన్రా. చస్తే నమ్మన్రా. మీ రంతా ఉరెట్టుకున్నా నమ్మన్రా. ఆ బడిపంతులు పెద్దమనిషంటే నేను నమ్మను. కోర్టువాళ్ళ కేంపోయింది. సాచ్చి కాలన్నీ కలగాపులగం చేసి. అన్నంలో రాళ్ళేరినట్టు లా పాయింట్లేరి, కేసంతా అబ్బుంచిటు తిరకాసుసేసి పారేస్తారు. ఒరే ఎంకయ్యా. నే నొదిలిపెట్టన్రా. పగ పట్టేనంటే నాగుపామే. హైకోర్టు కెళ్తాను. ఏటనుకున్నావో ఏటో. ఈ దేశంలో ఎన్నికోర్టు లున్నాయో వాటన్నిటి చుట్టూ తిప్పి మూడు చెరువుల నీళ్ల తాగిస్తాన్రా. ఏటనుకున్నావో ఏటో'' అన్నాడు నాయుడు కోపంతో మండిపడుతూ.

''అది నిజమే కాని....'' అంటూ నీళ్ల నమిలేడు వెంకయ్య.

''కానీ ఏటూ నంజికొడకా: ఇంకా సందేహ ముందేటి? నా దగ్గ రలాంటి సంగిరి కబుర్లు చెప్పకొరే. నాక్కోపమొచ్చిందంటే మనిషిని కాను తెలుసా'' అంటూ చిందులు తొక్కేడు నాయుడు. ''చెప్పరా నంజికొడకా. నువ్వనే దేటో చెప్పు.''

''రామారావుగా రన్నారయ్యా తమరు అనవసరంగా ఇబ్బంది పెట్టేరట. కాబట్టి పరువునష్టం దావా వేస్తారట.''

ఈ సారి నాయుడికి కోపం రాలేదు. పెంకు లెగిరిపోయేటట్టు గట్టిగా నవ్వేడు. ''బడిపంతులుకి పరువా? అది నష్టపోవడమా?'' అన్నాడు ఒక క్షణం అతికష్టం మీద నవ్వాపుకుని. ♦

# ఇదేనా లోకం?

ఆకాశాన్ని అంటుతున్న ధరలు,
మండుతున్న కడుపులు,
ఎండుతున్న డొక్కలు,
వీటి కంతమే లేదా?

॥ఇదేనా లోకం॥

అతకలేను బ్రతకలేను
నిరుపేదకు, కడుబీదకు
తావులేదు ఈ లోకంలో,

॥ఇదేనా లోకం॥

చాలీ చాలని అతుకుల గతుకుల
బ్రతుకులకు అంతమే లేదా?
ఉంటానికి ఇల్లు లేదు
తింటానికి తిండి లేదు
బీద ప్రజల ఆర్త నాదం
వినిపించుట లేదా?
కనుపించుట లేదా?

॥ఇదేనా లోకం॥

పూటకు తిండికే నోచుకోని
అభాగ్యులు, నిర్భాగ్యులు
ఎందరెందరో అంతు చిక్కరినాడు,

॥ఇదేనా లోకం॥

స్వార్థపరుల తాకిడి
పీడిత ప్రజలను బలి చేస్తోంది
ఇదేనా ఈ లోకం తీరు?
అనాథకు ఆశ్రయమే లేని
ఈ లోకం బాగుపడేదెప్పుడు?
బొమికలు గూడు కట్టుకున్న
పేదోళ్ళ ఆక్రందనలు
వినిపించుట లేదా?
గద్దె మీద బొద్దుగా కూర్చుని
రాజఠీవి వెలిగించుతున్నారా?
ఎప్పుడు? ఈ దేశం
బాగుపడేదెప్పుడు?

॥ఇదేనా లోకం॥

ఉంటానికి ఇల్లు లేదు,
తింటానికి తిండి లేదు,
బీద ప్రజల ఆర్త నాదం
వినిపించుట లేదా?
కనుపించుట లేదా?

॥ఇదేనా లోకం॥

—కొసరాజు సుజాత

మాదిరెడ్డి సులోచన



(గత సంచిక తరువాయి)

'గ్రావుంది బాబాయ్! మీ పి. ఐ. డి లు వేషాలు మారుస్తా రన్నమాట. రెండు మూడు సార్లు ఆ యింటికివచ్చాను, మీరు లేరని తెల్సింది '' తను యిల్లు విడిచింది మొదలు ఉమాపతి మరణించినవిషయాలు అన్నీ చెప్పాడు. అతనుకూడా సానుభూతి చూపాడు.'' తను చేసుకున్న ఖర్మ అనుభవించాడు. మనిషి మంచివాడే. బల హీనుడు. అందరినీ అదుపులో పెట్టలేడు. అందుకే మీఅత్త అంత విజృంభించింది. జరిగినదానికి విచారించి ఏం లాభం? ఆ మేడకూడా అమ్మివేయాలని చూస్తున్న ట్టున్నారు. పట్నం అవతలకుంది. అద్దెలు యెక్కువగా రావు. అదికాక అద్దెలు రావా లంటే చిన్న చిన్న వాటా లుండాలమ్మా. పెద్దమేడ మొన్న వారు ఖాళీచేస్తే అద్దె పెంచారుట. రెండు నెలలనుండి ఖాళీగానే ఉంది.''

''అత్తయ్య పట్టుదల మనిషి. మనం విచారించి ఏం చెయ్యలేము.''

"నీ జీవితము కుదుటపడినందుకు సంతోషంగా ఉంది తల్లి. వెళ్ళిరానా?''

''అదేమిటి బాబాయ్! భోజనంచెయ్యకుండానే.'' త్వరగా లేచి, దాదాతో పాయసం చేయించి, అతనికి వడ్డించింది. భోజనానంతరము ఆయన సుశీలను కొన్ని ప్రశ్నలు అడిగాడు. అతని కళ్లు అనుమానంతో వెతుకసాగాయి. "ఏమిటి బాబాయ్! మీ రేదో దాస్తున్నారు. నాకు చెప్పండి. నన్నీ ప్రశ్నలు ఎందుకు కడుగుతున్నారు?"

"ఏం లేదమ్మా ఊర్కేనే" తప్పించుకోబోయాడు, సుశీల వదలలేదు. ఒట్టు వేసింది.

''నిజానిజాలు భగవంతుడికి తెలుసమ్మా. వారంరోజుల క్రితం మేము దొంగనోట్లు ఒకవ్యక్తి మారుస్తుండగా పట్టుకున్నాము. అతనిని రకరకాలుగా ప్రశ్నించి, అవి ఎక్కడనుండి వచ్చాయో చెప్పమంటే అతను చెప్పలేదు. భయపెటితే చెప్తాడని రిమాండులో తీసుకున్నాము. ఈ దొంగనోట్ల మార్పిడి యెక్కువ జరుగుతుంది. సి. ఐ. డి. వారు చాలా కృషిచేస్తున్నారు. దొరికిన అవకాశము జారవిడుచుకోరాదని అతనిని నయాన, భయాన ప్రశ్నించసాగాము. ఒక ప్రముఖ వ్యక్తి తరపున ప్లీడరు వచ్చి అతనికి బేల్ యిచ్చి విడిపించాడు. రెండవరోజు పట్టుపడినవ్యక్తిస్వయంగా, వచ్చి కొన్నివివరాలు చెప్పాడు. ఊపిరి పీల్చటంకూడా మరచిపోయి వింటుంది సుశీల. ''సుధీర్ అనే అతను దొంగ నోట్లను అచ్చు వేస్తున్నాడట. అతని యిల్లు సోదాచేస్తే యంత్రము దొరుకుతుందని అడ్రసు చెప్పాడు. యే ఆధారంతో యిల్లు సోదా చెయ్యాలి? అందుకే నగలు తెచ్చాను. స్త్రీలు సాధారణంగా నగలు అనగానే అందులో చవకగా వస్తాయనగానే కొనడానికిప్రయత్నిస్తారు. ఇంటిలో తప్పక దొంగనోట్లుంటాయి. అవే యిస్తారు. వాటిఆధారంగా సర్చివారెంటు తీసుకోవచ్చని చూచాను ...కాని యిక్కడ నువ్వు దర్శనమిచ్చావు."

''బాబాయ్....బాబాయ్ .... మీ అల్లుడి పేరు సుధీర్....'' ఆమె కంఠము వణికింది. అతను ఉలిక్కిపడ్డాడు. ''మరి నన్నేం జేయమంటావు తల్లీ?''

"సర్చివారంటు దేనికి బాబాయ్. రండి సోదా చేద్దాము, ఎవరో చెప్పివుంటారు రండి బాబాయ్.'' ఇద్దరూ ఇల్లంతా వెతికారు. అతని బీరువాలు అన్నీ వెతికారు. ఎలాంటి ఆధారము దొరకలేదు. ''ఎక్కడో పొరపాటు జరిగి ఉంటుందమ్మా! వెళ్తాను. పిన్నిని తీసుకుని వస్తాను ఎంత సంతోషిస్తుందో?''

సీరియల్

అతను వెళ్ళిపోయాడు. మొదటిసారిగా భర్తజీవితం గురించి లోతుగాఆలోచించ సాగింది సుశీల. అనుమానాలు పెరగటం తప్ప తరగటం లేదు. ఆయన వ్రాసిన 'ప్రతీకారం' అనే కథలో నాయకుడు ఆయనే కాదుకదా! 'వద్దు. భగవాన్! అటువంటి ఆలోచనలు రానియ్యకు. నా భర్త సకల సద్గుణమూర్తి.' అని మాంగల్యము కనుల కద్దుకొన్నది. ఆ దినమంతా అన్యమనస్కంగా ఆరాటంగా గడిపినది. అతను వస్తే బాగుండును. అన్ని విషయాలు అడిగి హృదయం తేలిక పరుచుకొందును.' అనుకున్నది. స్వచ్ఛంగా మెరిస్తే ఆ కళ్ళు మోసం చెయ్యగలవా? అమాయకమైన ముఖం! దొంగతనం చేశాడంటే నమ్మగలనా? కథలు కేవలం ఊహాగానాలు. ఆలోచిస్తూ గడిపింది.

రెండవరోజు ఇన్‌స్పెక్టరు గారికి ఆనందంగా యెదురేగింది. "పిన్ని రాలేదేం బాబాయి!"

"వస్తుంది లేమ్మా. సుశీ! అలా గదిలోకి వెళ్ళి మాట్లాడుకుందాము." యిరువురూ గదిలోకి వెళ్ళారు. అతనేం చెప్తాడోనని ఆమె హృదయం వేగంగా కొట్టుకోసాగింది. ఇద్దరూ కూర్చున్నారు.

"సుశీ! విధి చిన్న ఇక్కడకూడా వంచిస్తుందనుకోలేదు తల్లీ. జన్మతః సుధీర్ ఉన్నతుడే....కాని....తండ్రి మరణించగానే అన్ని దురలవాట్లకు లోనై ఒకసారి జైలుకుకూడావెళ్ళి వచ్చినాడట." అతను చెప్పేది వినలేకపోయింది సుశీల. ప్రతిస్త్రీ తనభర్తను ఉన్నతంగా నే ఊహిస్తుంది. అలా ఊహించనిస్త్రీ.... అసలు భర్తను, భర్తగా కాక బానిసగా చూస్తుంది "అబద్ధం బాబాయి ఆయనను చూస్తే మీరు అలాఅనరు. పచ్చిఅబద్ధం".

"అబద్ధం అయితే అందరమూసంతోషిస్తాము." లేచి ఆమెదగ్గరకు వెళ్ళాడు. నువ్వు నాకు కూతురు వంటి దానవు. ధైర్యంగా విను. సుధీర్ దొంగనోట్లు వేయిస్తున్నాడట. అదికాక బయటినుండి కొన్ని వస్తువులు పైలెట్లకు. నావికులకు

---

❋ "ఎట్లా ఉన్నావు?" అడిగాడొక మిత్రుడు.

"భార్యతో వేగలేకుండా ఉన్నాను. రోజూ ఐదివ్వు, పదివ్వు అని ప్రాణం తీస్తూ ఉంటుంది. రోజంతా కష్టపడి ఎముకలు విరగ్గొట్టుకొస్తే ఇంట్లో యిదీ వరస. తల బద్దలవుతోంది!"

"ఆమె యీ డబ్బుతో ఏం చేస్తుంది?" అన్నాడా స్నేహితుడు.

"తెలియదు. నేను ఎప్పుడన్నా ఏమన్నా యిస్తే కదా, ఏం చేశావని అడిగేందుకు?"

లంచముపెట్టి తెప్పించి అమ్ముతున్నాడట. ఇవి నిశ్చయముగా తెల్సిన విషయాలు. ఇంకో ఆరాలు తీస్తున్నాము. నువ్వేం దిగులుపెట్టుకోకు." ఆమె తల నిమిరి నాడు. అతని చేతులలో అలా శిలలా యెంతసేపు ఉందో!

"ఇంత ఆవేదన తగదమ్మా. ఇందులోకొన్ని అబద్ధం కావచ్చుగా?...."

"కొన్ని నిజం అని నిశ్చయంగా చెప్తున్నారుగా? నేను.... నేను నష్టజాతకు రాలిని బాబాయ్! ఏ పూర్వపుణ్యమో, ఈ కొన్నిరోజులు సుఖంగా ఉన్నాను. పెట్టే వారిచెయ్యి పెద్దదయినా, తినేవారికి తిరు గుడు రోగం అన్నట్టుంది నా గీత. ఒంటరిదానను కాను, బాబాయ్ నన్ను రక్షించు, నా భర్తను నాకు వదలిపెట్టు." పిచ్చిగా అరిచింది.

"ఊర్కోతల్లీ. పూర్తిగా పరిశోధన జరగనీ! నేను నీ కన్యాయం చెయ్యను. చెయ లేను. నీ మంచితనము నీ భర్తకు అడ్డుపడుతుంది లేమ్మా." అన్నాడు.

"మీ డిపార్టుమెంటు వారు యింకా మంచితనము, మానవత్వమూ నమ్ము తున్నారా?"

"అదేంమాట తల్లీ! మానవుడయిన వాడెవడయినా నమ్ముతాడు. నీకు చెప్ప వల్సిన విషయాలంటే ఫోను చేస్తాను. తొందరపడి యే అఘాయిత్యము చెయ్య నని మాట యివ్వు" అని చేయిచాచాడు. ఆమె కన్నీరు ఒత్తుకుని నవ్వింది.

"రోజూ, రోజూకు బండబారి పోతు న్నాను. ఎమీ చెయ్యను. ఆ దిగులు అక్కరలేదు." ఎన్నో విధాలుగా నచ్చ చెప్పి వెళ్ళిపోయాడు ఇన్‌స్పెక్టరుగారు.

ఆ రోజు గదిలోనే గడిపింది. దాదా పలుసార్లు వచ్చి 'ఆరోగ్యం బాగుండ లేదా?' అని పలుమారులు అడిగి వెళ్లాడు.

'అమ్మా! ఆచ్చిపో దాం' అంటూ రాజా మారాం మొదలు పెట్టాడు. రాజాను

---

సామర్థ్యం చూపాలంటే అవకాశం కావాలి.

—నెపోలియన్

---

నావాకు అప్పగించినది ఆలోచనలు తెగ టము లేదు. అనుమానాలు విడటము లేదు.

రెండు రోజులు గడిచినా ఇన్‌స్పెక్టరు గారు ఫోను చెయ్యలేదు. ఆయన యింటి నంబరు తీసుకోలేదు. అసలు ఫోనుందో, లేదో వారి యింట్లో! శశికి ఫోను చెయ్యా లని వెళ్ళింది. మరలా తిరిగి వచ్చింది. ఆ రోజు ఉదయమే సుధీర్ వచ్చాడు. అతను ఎప్పటిలా ఉత్సాహముగా కని పించావా కళ్ళు లోతుకు పీక్కు పోయి నాయి ముఖం చిన్నగా కనిపిస్తుంది.

# జరిగిన కథ

సుశీల చిన్నతనంలోనే తల్లి దండ్రులను పోగొట్టుకొని మేనత్త కనకదుర్గమ్మ దగ్గర పెరుగుతుంది. ఒకసారి ప్రసన్నను చూడటానికి వచ్చిన పెళ్ళికొడుకు సుశీలను కట్నం లేకుండా చేసుకుంటానని ఉత్తరం వ్రాయిస్తాడు. దాంతో ఎలాగైనా తన దారి నుండి అడ్డం తొలగించుకోవాలని అరవయ్యేళ్ళ చలపతితో వివాహం నిర్ణయిస్తుంది దుర్గమ్మ. గత్యంతరం లేక రాత్రి పూట యింట్లోంచి పారిపోతూ సుధీర్ కారు క్రింద పడుతుంది. అదే రాత్రి కనకదుర్గమ్మ అప్పటికే జీవితంలో తప్పటడుగు వేసిన తన రెండో కూతురు శశినిచ్చి చలపతితో వివాహం ముగిస్తుంది. సుశీల నగలతో పెద్దకొడుకు యింట్లోంచి పారిపోతాడు. ఇవన్నీ సుశీల మూలంగా జరిగిన అనర్థాలేనని వాపోతోంది. హాస్పటలు నుండి తిరిగి వచ్చిన సుశీలను, తీసుకు వచ్చిన సుధీర్‌ను కలిపి నానా దుర్భాషలు మాట్లాడుతుంది, సుధీర్ పౌరుషంగా ఆమెను తన యింటికే తీసుకువెళ్ళి చదివిస్తాడు. సుధీర్ బాస్ చేసిన హెచ్చరిక, దానికి అతని సమాధానం చాటుగా విన్న సుశీల అతన్ని వివాహం చేసుకుంటానని చెప్పుతుంది. మర్నాడు వివాహం క్లుప్తంగా జరిగిపోతుంది. సుధీర్‌తో కలిసి ఢిల్లీకి వెళ్ళి వస్తుంది. మారిపోయిన తన మేనత్త పరిస్థితులు చూసి చాలా బాధ పడుతుంది. శంకర్ రాక ఎక్కువై శశి మానసికంగా కృంగిపోతుంది. జీవితాలు తారుమారైనా దుర్గమ్మ మనస్తత్వం మారదు. సుశీల రాజాను ప్రసవిస్తుంది. భర్త పూర్వ వృత్తాంతం తెలుసుకునేందుకు ప్రయత్నం చేసి విఫలురాలౌతుంది. అర్ధరాత్రి వర్షంలో తడుస్తున్న దుర్గమ్మ ఆమె భర్తను సుధీర్ రక్షించి ఇంటికి తీసుకు వస్తాడు. ఉమాపతి తన కోడలు జీవితం చూసి సంతోషిస్తాడు. ఉన్నట్టుండి హఠాత్తుగా అదే రాత్రి కన్ను మూస్తాడు.

—ఇక చదవండి.




మామూలుగా రాజాను ఎత్తుకున్నారు. ఆటలు. మాటలు అన్నీ జరుగుతున్నాయి. మునుపటిలా వారి ఆనందములో పాలు పంచుకోలేక పోతుంది. 'కడుపులో పేరు ఉన్న కసి అంతా కక్కేయాలని ఉంది. ఎలా? నల్గురు వింటే నాల్గు లోకాలు విన్నట్టు. ఈ చుట్టుపక్కల అంతా ఆయననీ పూజిస్తారు. దాదా వింటే క్షణంలో అందరికి తెలుస్తుంది. ఎలా? ఎలా?'

"అంత మౌనంగా ఉన్నావు. ఒంట్లో బాగుండలేదా సుశీ?" అతను ఈసారి భార్యవైపు పరీక్షగా చూస్తూ అడిగినాడు.

ఆమె ఆరు లంఘనాలు చేసినట్టు ఉంది.

"ఏం లేదు బాగున్నాను. ఉండండి కాఫీ తెస్తాను." అన్నది కన్నీరు అతనికి కనపడరాదని అక్కడి నుండి వెళ్ళిపోయింది.

"దాదా అత్యవసరముగా నువ్వు అత్తయ్యా వారింటికి వెళ్ళి రావాలి వాళ్ళ గురించి చెడు కలలు వస్తున్నాయి. రెండు రోజుల నుంచి పోదామా అనుకున్నాను. ఒక్కదానను అని ఊరుకున్నాను.... ఇప్పుడు వెళ్ళిరా!" అన్నది తొందర-తొందరగా.

"అందుకేనా అమ్మా, అంత దిగులు? వంట భోజనం కాగానే వెళ్తాను"

ఆమెకు అంతవరకు ఆగే ఓపిక లేదు,

"వంట అయింది చాలు. అయ్యగారు ప్రయాణపు బడలికలో ఉన్నారు. భోజనం అంతంత మాత్రమే. వెళ్ళి ఫలహారము సమయానికి రా!" అతనికి బస్సు కిరాయికి డబ్బులిచ్చి పంపి వేసింది.

అంతకుముందు రెండురోజుల నుండే పని మనిషి పెళ్ళికి పోతానంటూ రావటం మానేసింది. తలుపులన్నీ వేసింది. రెండు కప్పుల్లో కాఫీ తీసుకుని వచ్చింది.

"కాఫీ తయారు చేసి తెచ్చినట్టు న్నావే!" అన్నాడు.

అతనికిచ్చి తను తీసుకుంది. రాజా తండ్రి తెచ్చిన ఆట వస్తువులు పరీక్షించ టంలో నిమగ్నుడయినాడు. కాఫీ కప్పు కింద పెట్టాడు

"సుశీ! త్వరగా ఒక్క కునుకు తీసి. అలా వెళ్దాము. సినిమా షికారు విసుగు వచ్చింది. నీవు కూడా దిగులు పడ్డావల్లే ఉంది ముఖం చూస్తు." దగ్గరగా వచ్చి ఆమె నడుము చుట్టూ చెయ్యి వేశాడు.

ఆమె దూరం జరిగింది. "నాకు ఒక్క ప్రశ్నకు జవాబు చెప్పి. తరువాత మీరు చెప్పేది చెప్పండి" ఆమె గొంతు కఠి నంగా వణుకుతుంది.

"సుశీ! ఏమిటి కొత్తగా మాట్లాడు తున్నావు." ఆశ్చర్యంగా చూచాడు.

"కొత్తగానే మాట్లాడుతాను. మీరు నిజం దాచితే మన జీవితమే కొత్త దార్లు పడుతుంది. చెప్పండి — మీరు ... మీరు దొంగనోట్లు అచ్చు వేస్తున్నారా. లేదా? ప్రభుత్వము కన్ను గప్పి బయటినుండి దిగుమతి అయిన వస్తువులు అమ్ము తున్నారా, లేదా?.. "

"సుశీ!" అతని చెయ్యి ఆమె రెండు చెంపలను వాయించినవి.

"చెప్పండి.... మీరు నిజం చెప్పి కొట్టండి. చంపండి....భరిస్తాను!...." అన్నది నిర్భయముగా.

అతను ఆశ్చర్య పోయాడు.

"ఎందుకంత ఆశ్చర్యంగా చూస్తారు! ఎన్నడు లేనిది. దిక్కు మాలినది ఎదురు చెప్తుందనా? పోనీ ఒక్క విషయం చెప్పండి. నా మీద జాలి తప్ప మరేం లేదని... మీ మీద గౌరవమూ. కూడు. గుడ్డా యిస్తున్న యజమానులని గౌర విస్తాను." అన్నది

ఆమె రెండు బుగ్గలపై వాతలు

---

❊ ఈ చెప్పులు బాగా మన్నుతయా?' అని అడిగాడు కొత్తాదారుడు.

"అద్భుతంగా మన్నుతవి. ఒకసారి కొన్న వాళ్లెవరూ తిరిగి రానే లేరు!" అన్నాడు షాపువాడు.

స్పష్టంగా కనిపిస్తున్నాయి ఆమెను అతనికి దగ్గరకు లాక్కుని గట్టిగా హృదయాను హత్తుకున్నాడు.

"సుశీ! పొరపాటున ఆ మాట అనకు. నీపై జాలేనా నాకున్నది? లేదు-లేదు.... నాకీ ప్రపంచములో ఉన్న సర్వస్వము నువ్వూ, రాజా ..." అన్నాడు. అతని కంఠము రుద్దమయినది.

"అయితే రాజా మీద, నా మీద ప్రమాణం చేసి చెప్పండి. మీరు చేసే వ్యాపారము ఏమిటి?"

అతను ఆమెను వదలలేదు. ఆమె తలపై గడ్డం రాస్తూ కొన్ని క్షణాలు గడిపినాడు. దీర్ఘముగా శ్వాస వదిలినాడు "నిజమే....కాని అంతా నిజం కాదు.". అన్నాడు.

ఆమె అతని నుంచి దూరం జరిగింది. ఎందుకు చేశారు చెప్పండి? నాతో ఈ విషయాలు ఎందుకు దాచారు? ఈ దొంగ సొమ్ముతో మమ్మల్ని ఎందుకు పోషిస్తున్నారు? అంతకన్నా మీ చేత్తో యింత విషం యివ్వలేక పోయారా?"

అతను ఏమీ చెప్పలేదు. నేలకేసి చూస్తూ కూర్చున్నాడు.

"చెప్పరేం? నన్నెందుకు మోసం చేసినారు. ఆ దొంగ నోట్లతో నన్నెందుకు పోషించారు!" అన్నది గట్టిగా.

ఆమె అరుపులకు రాజా అదరిపోయి రాగం మొదలు పెట్టాడు. అతను త్వరగా లేచి రాజాను ఎత్తుకున్నాడు. "ఏం లేదు రాజా! అమ్మ తమాషా చేస్తుంది. ఊర్కో అమ్మా ఊర్కో!" అతను తల్లి వంక భయంగా చూస్తూ తండ్రి గుండెలకు హత్తుకు పోయాడు.

సుశీలకు మతి పోతుంది. "వాడిని దించండి. నాకు జవాబు చెప్పండి. వాడిని ముట్టుకోవద్దు." అరిచింది.

ఈసారి అతను కోపంగా చూచాడు. "సుశీలా! ఏమిటి వెర్రి? నేను పారి పోవటం లేదు. నీ సందేహాలన్నింటికి జవాబు చెప్తాను. కాని....వాడి ముందు అరచుకోవటం బావుండదు. పసివాడు భయపడి పోతాడు. ఏ జ్వరమో వస్తే.... వెళ్ళి పాలు తీసుకురా. వాడికి నిద్ర సమయమవుతుంది. వాడు నిద్రబోయాక మాట్లాడుకుందాము."

సుశీల లేవలేదు. స్రవించే అశ్రువులు ఒత్తుకుంటూ కూర్చుంది.

"రాజా! అమ్మ దగ్గరకు వెళ్లు. నేను పాలు తెస్తాను." అని సుశీల కందించబోయాడు.

వాడు తండ్రి భుజాన్ని గట్టిగా పట్టుకున్నాడు. "ఊఁ....అమ్మొద్దు." అని మారాము మొదలు పెట్టాడు.

వాడిని అట్లాగే ఎత్తుకుని వంటయింట్లోకి వెళ్ళాడు. గిన్నెలో పాలు.







హీటరు మీద వెచ్చబెట్టి సీసాలో పోసి త్రాగించబోయాడు.

"వద్దు, బాలే...." వాడు ముఖం చిట్లించాడు.

పంచదార వెయ్యలేదని గుర్తుకు వచ్చింది. మళ్ళీ వంట యింట్లోకి వెళ్ళి పంచదార వెతికి తెచ్చి వాడి పాలలో కలిపి పట్టాడు. ఈసారి త్రాగి, హాయిగా నిద్రబోయాడు. వాడి మూతి తుడిచి మంచమ్మీద పడుకోబెట్టాడు. అతన్ని, అతని పనులను చూస్తూ కూర్చుంది.... అతను వచ్చి ఆమె కెదురుగా ఉన్న కుర్చీలో కూర్చున్నాడు.

"సుశీలా! ఒక్క విషయం గుర్తుంచుకో. నేనేం చేసినా, మిమ్మల్ని మాత్రం దొంగనోట్లతో పోషించ లేదు. నేను వ్యాపారం చేసిన డబ్బే వాడినాను...."

"ఏం వ్యాపారం? విదేశ వస్తువులు దొంగతనంగా అమ్మడమేగా!"

(సశేషం)

రిటైర్డ్ సెషన్స్ జడ్జి శ్రీ బండి సీతారామమోహన్ రావు పరిశీలించిన కేసు




(గత సంచిక తరువాయి)

ఎంకమ్మ ముత్యాలుతో చెప్పకుండా సూరన్న ఆలోచనతో ఆ వూరికి దగ్గరలో వున్న తన పుట్టింటికి వెళ్ళిపోయింది. ముత్యాలులో మార్పేమీ లేదు. గుబులు పుడితే యింటికి వెళుతున్నాడు. లేకపోతే టీ కొట్టు ఫలహారాలలో కడుపు నింపుకొని, స్టేషనుతో పడుకుంటున్నాడు.

"ఏంటిరా....ముత్యాలూ....ఎల్లి దాన్ని తెచ్చుకోకూడదూ" దీర్ఘంగా ఆలోచిస్తున్న ముత్యాలుని ఉబుసుపోకకు పలుకరించినట్లు అన్నాడు సూరన్న.

సమాధానంగా సూటిగా చూసి, తల దించుకున్నాడు ముత్యాలు.

ఆ చూపుకు హడలెత్తిపోయాడు సూరన్న. గుండెలు పిండేసినట్లయినాయి. తను అప్పుడప్పుడు ఎంకమ్మ దగ్గరకు వెళ్ళి రావటం గ్రహించాడేమోనని కలవరపడ్డాడు. "ఏందిరా....మరీ....అన్యాయమయి పోయావు...." భయాన్ని కనబడనీకుండా సానుభూతి వాక్యాలు పలుకుతూ అవతలికి జారుకున్నాడు సూరన్న.

* * *

"ఏంది మావో....రాత్రి రాలేదే.... పొద్దున్నే దిగబడ్డావ్" తూలుతూ వస్తున్న సూరన్నను అడిగింది లచ్చి.

"యసె వుండెహె....డూటీ నేసి వత్తుంటేమా...." కసురుకున్నాడు సూరన్న.

"ఏ డూటీ.... రైలు డూటీయేనా?" నవ్వుతూ అనేసి వూరుకుంది.

సూరన్న కూడా సమాధానం చెప్ప లేదు. నిద్ర ముంచుకొస్తున్నట్లు మంచం మీద నడుం వాల్చాడు.

రెండు రోజులకో మారు సూరన్న వెంకమ్మ దగ్గరకు వెళ్ళి రావటం పసి గట్టింది లచ్చి. ఈ విషయం బయట పెడితే తన మొగుడి ప్రాణాలు బలి గొంటాడు ముత్యాలు. చుట్టుప్రక్కల వాళ్ళకు తెలిసి అల్లరైపోయి, అతని చెవి దాకా పోతుందని నోరు మూసుకొని వుంది. కాని దీనికో మార్గం చూడందే తన కాపురం నిలబడేట్లు లేదని ఓ నిరా రణకు వచ్చింది.

సూరన్న అప్పటికే గుర్రు పెడు తున్నాడు. లచ్చి ముత్యాలు యింటికి దారి తీసింది. అతను శూన్యంలోకి చూస్తూ ఏదో ఆలోచిస్తున్నాడు. ఆ చూపులకు లచ్చి నిర్ఘాంత పోయింది. ఎంతటి మనిషి ఎలా అయిపోయాడనుకుంది.

"ముత్యాలన్నా...." దగ్గరకెళ్ళి పలక రించింది.

మెల్లగా యిటు తిరిగి చూశాడు ముత్యాలు. అతని కళ్ళల్లో కన్నీరు.

లచ్చి హృదయం ఝల్లుమంది.

"అన్నో....ఎంకమ్మొదిన్ని తీసుకు రానా...." నసిగింది లచ్చి.

''అది రాదు సెల్లెమ్మా....'' పరితపిస్తున్న కంఠంతో అన్నాడు.

''ఎందుకు రామూ....నే తీసుకొస్తానుండు....ముందు నూ లేపి పన్లోకెళ్లు.'' అంది.

''దాన్ని అనవసరంగా కొట్టాను....అందుకని దానికీ మనసిరిగి పోయింది.'' అన్నాడు బాధగా.

''ఓస్....అదా....అదంతా నే చూసుకుంటాలే....'' అంటూనే వెళ్ళిపోయింది లచ్చి.

ఆ తెల్లవారే ప్రక్కనేవున్న వెంకమ్మ వూరికి వెళ్ళింది. వెంకమ్మ బొద్దుగా, అందంగా, నున్నగా తయారైనట్లు కనిపించింది లచ్చి కళ్ళకు. కోపంతో పళ్ళు కొరుక్కుంది. ఏమీ ఎరుగనట్లు నవ్వుతూ దరిచేరింది. శతవిధాల నచ్చజెప్పి నమ్మించింది. అంతగా అవసరమైతే రెండు రోజులు తన యింట్లో వుండి ఆ తర్వాత వెళ్ళమని చెప్పింది. వెంకమ్మకు రావటానికి యిష్టం లేకపోయినా వూర్లో వాళ్ళు ఏమైనా అనుకుంటారు కనుక బయలుదేరక తప్పింది కాదు.

ఆ మధ్యాహ్నానికి కల్లా వాళ్ళ వూరు వచ్చారిద్దరూ. వీరిద్దరూ రావటం దూరాన్నుంచి ముత్యాలు చూశాడు. అతన్ని లచ్చి చూసింది. వెంకమ్మ ఏదో ఆలోచిస్తూ నడవటంలో చూడలేదు. వెంకమ్మ చూడకుండా చెయ్యి వూపి సైగ జేసింది లచ్చి. దాంతో అతను అటునుంచి అటే వెళ్ళిపోయాడు.

''ముత్యాలన్న యింట్లో వుంటాడో వుండడో....అందాకా యిక్కడే వుండాదినా?'' ఇంటికి వెళ్ళిన తరువాత మామూలుగా అంది లచ్చి.

సరేనన్నట్లు తలూపింది వెంకమ్మ.

ఏదో సాధించానన్నట్లుగా, ఒక కాపురాన్ని నిలబెట్టానన్నట్లుగా దిక్కు తోచనట్లు హడావిడిగా తిరుగుతుంది లచ్చి. వెంకమ్మకు అంతా అయోమయంగా వుంది. సూరన్న వస్తే ఏం చెప్పాలో అర్థం కావటం లేదు. ద్రోహం చేసినట్లవుతుందని తన నమ్మకం!

---

❋ ఒక పెద్ద పార్టీలో ఒక పెద్దమనిషి పర్సు పోయింది.

ఆ పెద్దమనిషి టేబిల్ మీదికి ఎక్కి ''ఆరు వందల రూపాయలున్న నా పర్సు పోయింది. దొరికిన వారు నాకు యిస్తే యాభై రూపాయలిస్తాను!....'' అన్నాడు.

వెనుకనుంచి ఒక గొంతు ''నేను ఎనభై యిస్తాను!'' అన్నది.

"వొదినా! నువ్వేటికెళ్ళి తానం చేసి రా!...." హడావిడిగానే అంది లచ్చి.

"అమ్మో....నాకు భయం! నేనొక్క దాన్నే ఎల్లలేను. నువ్వు కూడా రా...." అంది వెంకమ్మ.

"ఏం....మా అన్న పట్టుకుంటాడనా నీ భయం! అంతా సవ్యంగా ఆలోచించే తీసుకొచ్చాలే....మా అన్న నీ జోలికే రాడు. తొరగా ఎల్లిరా...." పురమాయించింది లచ్చి.

వెంకమ్మకు కూడా శరీరమంతా చమటతో చిరబురలాడుతూంది. మామూలు సమయాల్లో అయితే ఏటికెల్లాలంటే తానెంతో ధైర్యంగా వెళ్ళేది. కాని తప్పు చేసింది కనుక తనకెంతో భయం. అదీ గాక సూరన్న యింటికి వచ్చి రాకముందే అతని ముఖం చూడలేదు తను. ఏటికి వెళ్ళి రావటమే మంచిదిగా తోచింది.

"అయితే నువ్వు రావా వొదినా?" ఆఖరుసారిగా మనసు వుండబట్టలేక అడిగింది.

"సరే. నువ్వు పోతావుండు వత్తా!" అంది లచ్చి.

సంచిలోంచి ఉతికిన బట్టలు తీసుకొచ్చి బయలుదేరింది వెంకమ్మ. అడ్డు జారిన పడి ఏటికి వెళ్ళసాగింది. ఎందుకో ఆమెకు భయంగానే వుంది.

ప్రొద్దు గ్రుంక బోతూంది. దారిలో యిద్దరు-ముగ్గురు వెంకమ్మను పలుకరించారు. మామూలుగానే సమాధానం యిచ్చింది.

ఏటి దరిదాపుకు వెళ్ళింది వెంకమ్మ. చుట్టూ కలయజూచింది. ఎవరూ మసలుతున్నట్లు లేదు. శరీరం మీదున్న వలువలు ఒక్కొక్కటే విడి చేసింది. చలికి శరీరమంతా ఆదో మాదిరయి పోయింది. వక్షస్థలానికి చేతులు అడ్డం పెట్టుకొని, ఏటిలో మొలలోతు దిగి స్నానం చేయసాగింది.

క్రమంగా చీకట్లు ఆవరిస్తున్నాయి.... దూరంగా ఎవరో వస్తున్నట్లయి పరికించి చూచింది వెంకమ్మ. లచ్చి మెల్లిగా వస్తుంది. అంతవరకు వున్న భయం కాస్త తగ్గినట్లయింది. వడివడిగా నీటిలోంచి ఒడ్డుకు అడుగులు వేయసాగింది. అప్పటికే లచ్చి ఒడ్డున సమీపిస్తుంది.... వెంకమ్మ బట్టలు అందుకొనేందుకు వంగబోయింది. లచ్చి చేతులోవున్న పదునైన కత్తి ఆమె పొత్తికడుపులో బలంగా దిగబడి పోయింది. 'అమ్మా' అంటూ లచ్చిని చూచింది వెంకమ్మ. ఆమె కళ్లల్లో కసి అప్పుడే చల్లారుతూంది. ఏదో అనాలని నోరు తెరవబోయింది. అంతకంటే వేగంగా లచ్చి కుడికాలు వెంకమ్మ గొంతును బలంగా తాకింది. విసురుగా నేలకు ఒరిగి పోయింది వెంకమ్మ. ఒరిగిపోయింది మరి లేవనే లేదు. ఆమెలో దిగబడిపోయిన కత్తిని బలంగా బయట లాగింది లచ్చి. దాని సహాయంతోనే బాగా తడిచివున్న స్థలంలో వెంకమ్మను పూడ్చిపెట్టేంత గొయ్యి తీసింది. ఎవరి సహాయం లేకుండా ఆమె శవాన్ని, బట్టల్ని అందులో పూడ్చి పెట్టి ఏమీ ఎరుగనట్లు యింటికొచ్చేసింది.

* * *

ఒక వ్యక్తి ప్రాణం బలిగొన్న వారు శిక్షింపబడక పోరు. లచ్చి ఉద్రేకంలో వెంకమ్మను తానే చంపానని ఒప్పుకుంది. శిక్షింపబడింది.

* * *

కుట్రలు చేస్తే ఆదారుణ కృత్యాలు తమ పాలిటి శత్రువులుగా వెంటాడుతాయి ప్రతి వ్యక్తి చివరి దశలో. నిండు ప్రాణాలను బలిగొంటున్న వారు యింకా మన మధ్య వున్నారు. వారి చివరి ఘడియలు ఎంతటి నికృష్టపు దశతో అంతమవుతాయో వారికే తెలియదు.

# సిగరెట్

# మానేందుకు

# చిట్కాలు



(గత సంచిక తరువాయి)

సిగరెట్ మానటం ఎలా అంటే,

"ఓస్, అంత సులభం మరొకటి లేదు, నేను సవాలక్ష సార్లు మానేశాను." అంటారు దర్శక, నిర్మాత శ్రీ కె.ఎస్. ప్రకాశరావు. ఈ సందర్భంగా ఆయన ప్రసిద్ధ ఆంగ్ల రచయిత మార్క్‌ట్వేన్‌ను ఉదహరిస్తాడు.

"Easy,
I Have stopped
Many Times"

* సిగరెట్లు కాల్చటం మానటానికి మొదటి మెట్టుగా రోజూ కాల్చే సిగరెట్ల సంఖ్యను తగ్గించండి.

* సిగరెట్ కొట్లో ఖాతా వుంటే వెంటనే తీసివేయండి. అప్పు పెట్టి సిగరెటు కొనటం మానండి. ఎవరైనా సిగరెట్ ఆఫర్ చేస్తే తీసుకోవద్దు.

* మీరు అంతవరకూ కాలుస్తున్న సిగరెట్ బ్రాండ్‌ను మార్చండి.

* సిగరెట్లు ప్యాకెట్లుగా కొనటం మానండి. ఎప్పుడూ ఒకే ఒక సిగరెట్



శ్రీ కె. ఎస్. ప్రకాశరావు

కొనటం మొదలు పెట్టండి.

* సిగరెట్లు జేబులో వేసుకొని బయటకు వెళ్ళవద్దు "ఇంట్లో మామూలుగా సిగరెట్ ప్యాకెట్ పెట్టేచోట పెట్టవద్దు. అసలా మాటకొస్తే ఇంటికి వెళ్తూ సిగరెట్లు కొనటం మానండి.

* సిగరెట్‌ను కాల్చే తీరును మార్చుకోండి. అంటే కుడిచేత్తో పట్టుకొని కాల్చటం అలవాటైతే ఎడమ చేతితో పట్టుకోటానికి ప్రయత్నించండి. అలాగే నోట్లో పెదాల మధ్య కుడిపక్కన పెట్టుకుని కాల్చటం అలవాటైతే ఏడమవైపుకు మార్చండి.

* సిగరెట్ బూడిదను రాల్చే యాష్ ట్రేలను మార్చండి. కూర్చునే చోట పడక ప్రక్కన యాష్‌ట్రేలను తీసి వేయండి.

## అధూమపానీయుల సంఘం

* సిగరెట్ మానటానికి ప్రయత్నించటంలో మీలాగే సిగరెట్ మానటానికి ప్రయత్నించే వాళ్ళు మీకెంతో తోడ్పడగలరు.

సిగరెట్లు మానటానికి ప్రయత్నించే వాళ్ళందరూ కలిసి ఓ చిన్న సంఘాన్ని నెలకొల్పుకోండి. రోజూ సాయంకాలమో, లేదా వారానికి ఓసారో సమావేశమై సిగరెట్లు మాన్పటానికి ప్రయత్నించటంలో మీ మీ అనుభవాల్ని ఒకరి నొకరు వెల్లడించుకొని చర్చించండి; మరుసటి వారానికి తలపెట్టిన కార్యక్రమాన్ని గూర్చి తర్కించండి.

ఈ విషయంలో సిగరెట్లు మానటానికి ప్రయత్నించే ప్రతి ఇద్దరూ ఓ జోడీగా యేర్పడటం మంచిది. ఎందుకంటె సిగరెట్ మానటానికి చేసే ప్రయత్నంలో ఒకరిపై ఒకరు గూఢచారి పని చేయటానికి; ఆత్మ వంచన, సంఘ వంచన, చేయకుండా కార్యక్రమాన్ని జయప్రదం చేయటానికి ప్రయత్నిస్తుందీ లేందీ వారాంతంలో సమావేశంలో సమీక్షించుకోవచ్చు.

## రకరకాల అలవాట్లూ, చిట్కాలు

అంతేగాదు-సిగరెట్ అలవాట్లు ఒక్కొక్కరికి ఒక్కో విధంగా వుంటాయి. సిగరెట్లు మానేయటానికి ప్రయత్నించాలంటే ముందు ఆ అలవాట్లను మానుకోవాలి.

* కొంతమందికి ఉదయం పడక మీదనుంచి లేస్తూనే సిగరెట్ వెలిగించటం అలవాటు. కొందరు సిగరెట్ వెలిగించి తేనే గాని పడక దిగరు.

అటువంటివారు పడక ప్రక్కన సిగరెట్లు పెట్టుకోవటం మానాలి. ఉదయం నిద్ర లేచి చేయి చాపితే సిగరెట్ అందదు మరి... అందువలన చిరాకు వేయవచ్చు. వేయవచ్చేమిటి-మొదట చిరాకు వేస్తుంది; అది తప్పదు. అంతవరకూ నరనరాల్ని, రక్త కణాల్ని పెనవేసుకున్న నికొటైన్ ప్రియురాలి వియోగం చిరాకును, పరాకును కల్గిస్తుందనటం నిజం.

ఆ చిరాకును పారద్రోలటానికి, మనసు సిగరెట్లు ఎక్కడున్నాయో అని తహతహలాడకుండా వుండటానికి మొదట చేతికి అందుబాటులో ఆ ఉదయం దినపత్రిక

ఉండేలా చూచుకోవాలి. అంటే పడక నుంచి లేవకముందే దినపత్రికను చేతిలోకి తీసుకోవాలి. దాంతోబాటు ఓ గ్లాసెడు మంచినీళ్లు, అందుబాటులో వుంటే ఓ గ్లాసుడు నిమ్మరసమో, నారింజరసమో పుచ్చుకోవటం మంచిది. నారింజ రసానికి సిగరెట్ పొగకూ పొత్తు కుదరదు. అంటే నారింజ రసం తాగి వెంటనే సిగరెట్ ముట్టిస్తే నోటికి ఇంపుగా వుండదు; వెగటు అనిపిస్తుంది.

## నిద్రలేవగానే

* పడక మీదినుంచి లేవగానే చాలా మందికి కాఫీ తాగుతూ సిగరెట్ వెలిగించటం అలవాటు. అటువంటి వారికి సిగరెట్ లేందే కాఫీ రుచించదు. అందుకని సిగరెట్ అలవాటు మానుకునేంతవరకూ కాఫీ బదులు టీ, కోకో, లేదా మరేదైనా వేడివేడి పానీయం తీసుకోండి. లేదా, పంచదార తక్కువగా లైట్ కాఫీ తీసుకోవటం అలవాటు చేసుకోండి. కాఫీలో రవ్వంత మిరియాలు పొడి వేసుకొని తాగి చూడండి; లేదా ఓ టీ. బిస్కెట్ కాఫీలో ముంచి తింటూ కాఫీ తాగండి.

* ఉదయం టిఫెన్‌లో అంతకు ముందు తీసుకునే పదార్థాలు బదులు మరేమైనా తీసుకోండి. అంటే, రోజూ ఇడ్లీ వడ తీసుకోవటం అలవాటైతే ఉప్మా, దోసె, పూరీలను మార్చండి. టిఫిన్ చేసేటప్పుడు చల్లటి మంచినీళ్లు ఎక్కువగా పుచ్చుకోండి; పత్రికో-పుస్తకాన్నో తిరగ వేయండి.

* టిఫిన్ అయినంతర్వాత మనసు సిగరెట్ మీదకు మళ్ళితే ఓ పిప్పరమెంటో లేదా భావన అల్లం, భావన జీలకర్రా, కాల్చిన లవంగమో, అవి ఏవీ లభ్యం గాకపోతే నాలుగు ధనియపు గింజలో, సోపు గింజలో నోట్లో వేసుకోండి.

* తీరిక వేళల్లో సోమరిగా ఆలోచిస్తూ కూర్చుంటే మనసు సిగరెట్ కోసం పలకరించటం సహజం. అందుకు ఎప్పుడూ సోమరిగా కూర్చోకండి. ఏదైనా పుస్తకం చదువుతూనో, లేదా ఇంట్లో పాడైపోయిన చిన్నచిన్న వస్తువుల్ని మరమ్మత్తు చేస్తూనో చిన్నపిల్లల్తో ఆడుతూనో, లేదా వాళ్ళకు పాఠాలు చెప్తూనో గడపండి. అంతగైతే కొద్దిసేపు పెరడులోనో, మేడమీనో పచార్లు చేయండి. లేదా షేవింగ్ చేసుకుంటూనో, స్నానాల గదిలోనో కాలం గడిపండి.

* ఉద్యోగాలు చేసేవాళ్ళు ఆఫీసుకు వెళ్ళటానికి బస్సు కోసం నిరీక్షించేటప్పుడు ఒకటి రెండు సిగరెట్లు కాల్చటం అలవాటు. సమయానికి బస్సు రానపుడు, బస్సు స్టాపులో నిలబడకండి. మరో స్టాపింగ్‌వరకు నడవటంవలన సిగరెట్ ధ్యాస మళ్లుతుంది. లేదా బస్సు స్టాపుతో

ఫొటోలు, నిర్వహణ: జి. యస్. భూషణ్



మహాకవి ఆరుద్ర

నిరీక్షించటం తప్పనపుడు బస్సు వచ్చేంత వరకు ఏదైనా పత్రికనో, పుస్తకాన్నో తిరగేయండి. ప్రక్కనున్న వాళ్ళను మాటల్లోకి దింపి సిగరెట్ కాల్చాలనే కోర్కెను అణచుకోవడానికి ప్రయత్నించండి. కాల్చిన లవంగాన్నో, మిరియాన్నో బుగ్గన పెట్టుకుని చప్పరించండి.

* క్యూలో గంటలకొద్దీ నిలబడాల్సొచ్చినపుడు ఎవరి కోసమైనా అసహనంతో నిరీక్షించాల్సినపుడు పైసూత్రం అన్నివిధాలా వర్తిస్తుంది.

• కొందరు సిగరెట్ మానటానికి చాక్లెట్లు, పంచదార బిళ్ళలు, చ్యూయింగ్ గమ్ అలవాటు చేసుకుంటారు. సామాన్యంగా వీటిని ఉపయోగించకండి. ఆ మాట కొస్తే దేన్నీ అలవాటు చేసుకోవద్దు.... ఉన్న అలవాటును పోగొట్టుకోటానికి క్రొత్త అలవాటును కొని తెచ్చుకున్నట్లవుతుంది.

## కారు సిగరెట్

• కారు డ్రైవ్ చేస్తున్నప్పుడు హుషారుగా సిగరెట్ వెలిగించటం కొంతమందికి అలవాటవుతుంది. అటువంటి వాళ్ళు సిగరెట్ కాల్చాలని మనసైనపుడు కారు రేడియోను ఆన్ చేయండి; కారు రేడియో లేకపోతే ఓ ట్రాన్సిస్టార్ రేడియోను వెంట తీసుకెళ్ళండి. కారులో ఎప్పుడూ ఒంటరిగా ప్రయాణం చేయవద్దు. తోడు ఎవరైనా కూర్చోబెటుకోండి. మనసు సిగరెట్ మీదికి మళ్ళకుండా మాట్లాడుతూ వుండండి. కాల్చిన లవంగాన్నో, మిరియాన్నో, భావన అల్లం ముక్కనో బుగ్గన పుంచుకోండి. సిగరెట్ అలవాటును మానివేయటంలో కారు డ్రైవ్ చేసేటప్పుడు జాగ్రత్త. చిరాకు పరాకు చెంత చేరకుండా చూసుకోవటం అవసరం.

* మధ్యాహ్న విరామ సమయంలో భోజనం చేసిన తర్వాత, లేదా టిఫిన్ చేసిన తర్వాత సిగరెట్ కాల్చటం చాలా మందికి అలవాటు. ఆ అలవాటును మానుకోటానికి స్నేహితుల్ని మాటల్లోకి దింపండి; లేదా ఏ స్నేహితుడుకైనా టెలిఫోన్ చేయండి మధ్యాహ్నం కాఫీతో పాటు ఐస్‌క్రీమో లేదా యాపిల్ పండో ఆరగించండి. లేదూ ఓ గ్లాసుడు చల్లటి నీళ్ళు కాని, నిమ్మరసం, నారింజరసం గాని తాగి లేచి నిలబడి గట్టిగా గాలి పీలుస్తూ బ్రీతింగ్ అభ్యాసాలు చేయండి. ఆ తర్వాత కొద్దిసేపు కుర్చీలో విశ్రాంతి తీసుకోండి.

• ఇతరులతో మాట్లాడేటప్పుడు



ఆరుద్ర చేతిలో కలంతోపాటు సిగరెట్....

సిగరెట్లు కాల్చటం బాగా అలవాటైనవారు ఆ సమయంలో సిగరెట్‌పైకి మనసు మళ్ళగానే లేచి నిలబడి లేనిపని కల్పించుకుని అంటే ఏ పుస్తకాల్ని సర్దుతూనో, మరే పనైనా చేస్తూనో. అవతల వారితో మాటలు సాగించండి. కూజాదగ్గరకు వెళ్ళి ఓ గ్లాసెడు చల్లటినీళ్ళు త్రాగండి. చిత్తుకాగితంమీద పెన్సిల్‌తోనో, కలంతోనో ఏదో ఒకటి గిలుకుతూ పుండండి. మధ్యమధ్య గట్టిగా గాలి పీల్చండి.

## టెలిఫోన్-సిగరెట్

• టెలిఫోన్ చేసేటప్పుడు కొందరు సిగరెట్ అలవాటు ప్రకారం కాలుస్తారు. అటువంటివారు ఆ అలవాటును మానేయాలంటే, ముందు టెలిఫోన్ చేసేపద్ధతి మార్చండి. అంటే అంతకు ముందు

విలో్చని ఫోన్ చేయటం అల వా టై తే. కూర్చొని చేయండి. టెలిఫోన్ రిసీవర్‌ను కుడిచేత్తో పట్టుకోవటం అలవాటైతే, ఎడమచేతికి మార్చండి. ఫోన్ చేస్తున్నంత సేపు, రెండో చేతికి ఏమైనా పని కల్పించండి. చిన్న బొమ్మతో ఆడుకోటమో లేదా ఏదైనా కాగితంమీద గిలకటమో చేయండి. ఓ గ్లాసెడు మంచినీళ్ళు త్రాగండి.

* స్నానంచేస్తూ కూనిరాగాలు తీసే వాళ్లలాగే, సిగరెట్లు కాల్చేవాళ్ళు కూడా ఉన్నారు. షవర్‌బాత్ తీసుకునేవాళ్ళు సిగరెట్ కాల్చటానికి అవకాశం ఇవ్వకుండ షవర్ క్రింద కూర్చోండి. తొట్టిస్నానం చేసే వాళ్ళు. టబ్‌లో పడుకొని సిగరెట్ కాల్చేబదులు బ్రీతింగ్ ఆవారాన్ని ఆచరించండి. అంటే తెలుసుగా. గుండెల నిండుగా గాలిని పీల్చి మళ్ళీవిడవటం ...

## విందు-సిగరెట్

* విందు తాలూకు విందులు అలవాటైనవాళ్ళకు అంటే విస్కీ, బ్రాందీ, ఇత్యాది హాట్ డ్రింక్ పార్టీలకు తరచూ హాజరయ్యే వాళ్ళకు విందుతోబాటు సిగరెట్ తప్పదు. అయితే ఈ అలవాటును మాన్పటం చాలాకష్టంతో కూడుకున్న పనే మరి. అలవాటైన విస్కీ, బ్రాందీలను మానమనటం యెలాగో వాటి జత అయిన సిగరెట్‌ను మానమనటంగూడా అంతే. పార్టీకి పోయేటప్పుడు వెంట సిగరెట్లు, అగ్గిపెట్టె తీసుకు వెళ్ళవద్దు. విందుచేసే దానకర్ణులకు ముందుగానే ఫోన్‌చేసి సిగరెట్లు, అందుబాటులో వుంచవద్దని చెప్పండి. విందులో ఎవరైనా సిగరెట్ ఆఫర్ చేస్తే పుచ్చుకోవద్దు. మొఖమాటానికి ఒకటి కాల్చారో నిషా ఇచ్చే హుషారులో చేతిలోని గ్లాసుల్తో సిగరెట్ సంఖ్యగూడా అధికమౌతుంది. మనసును అదుపులో పెట్టుకోటానికి విఫలురయ్యారనుకోండి, కొంతకాలం విందుపార్టీలకే వెళ్ళకండి. వెళ్ళకుండా వుండడం కష్టమే. కాని సిగరేట్ మానేయటానికి కొందరి విషయంలో అది తప్పదు మరి.

## జోల సిగరెట్

## లాలి సిగరెట్

* కొందరికి రాత్రిళ్ళు పడుకోబోయే ముందు సిగరెట్ తాగే అలవాటుంది. అటువంటివాళ్ళు పడకకు చేరబోయే ముందుగా పళ్లు టూత్‌పేస్ట్‌తో తోము కోండి. లేదా పెప్పర్‌మెంట్ ఆయిల్ కలపిన నీళ్ళతోగాని. లిస్టరిన్, డెట్టాల్ మౌత్‌వాష్‌తో గాని, వేన్నీటితో గాని పుక్కిలి బట్టండి. ఆహ్లాదకరమైన రుచితో పరిశుభ్రంగా వుండే నోటిని సిగరెట్ కాల్చటంద్వారా అపరిశుభ్రం చేసుకోటానికి మనసు ఎదురు తిరుగుతుంది మనసు సిగరెట్‌మీదకు మళ్ళకుండా నిద్రవచ్చేంత వరకూ పడకమీద పడుకొని ఏదైనా పుస్తకమో, పత్రికో చదువుకోండి. చేతికి అందుబాటులో సిగరెట్లు వుంచుకోవద్దు.

* రాత్రి కలయిక అనంతరం కొందరికి సిగరెట్ కాల్చటం అలవాటు. అటువంటి వాళ్ళకో సలహా, రతి అయిం

తర్వాత అలసి వెంటనే నిదురించకపోతే, మనసు సిగరెట్ కోసం కలవరించకుండా హాయిగా గోరువెచ్చటి నీళ్ళతో స్నానం చేయటం. లేదా మందు పార్టీలకు వెళ్ళే వాళ్ళు ఈ మందుతో సిగరెట్ కాల్చే అలవాటు మానివేయ గల్గినట్లయితే కొంచెం బ్రాందీ సేవించండి. బ్రాందీ పుచ్చుకోలేనివాళ్ళకు ఓ ఔన్స్ 'ద్రాక్షారసం' సరైన ఔషధం.

* రాత్రిళ్లు నిద్రరాక కొందరు ఒకటే సిగరెట్లు కాల్చుతారు. అటువంటివారికి సిగరెట్ విడువలేని నేస్తమే అవుతుంది నిద్ర రాకపోయినప్పుడు పై కప్పువంక చూస్తూనో, ఏమేమో ఆలోచిస్తూనో సిగరెట్లు ఒకదానితర్వాత ఒకటి కాల్చకండి. అందువలన సిగరెట్లు ఖాళీఅయి అసలు నిద్రపట్టకుండా పోతుంది. అందుకని నిద్రరానప్పుడునిద్రపట్టేంతవరకు ఏదైనా పుస్తకం తీసుకొని చదవండి. లేదా రేడియోను ట్యూన్ చేసి వినండి. ఒక ఔన్స్ ద్రాక్షారసం తీసుకొండి. అప్పటికీ నిద్ర

పై చెప్పిన చిట్కాలను తూచా పాటించితే మీరు తప్పక సిగరెట్లు మాని వేయ గల్గుతారు. ఎటొచ్చీ సిగరెట్లు కాల్చటం మానేయాలనే సంకల్పం, దీక్ష మీలో ఉంటే సరి. సిగరెట్టు తప్పక మానేయగలరు.

తప్పని ఇబ్బందులు

తప్పించుకునే ఉపాయాలు

* అయితే సిగరెటు కాల్చటం చటుక్కున మానేయటంవలన శారీరకంగా కొన్ని ఇబ్బందులు ఎదురౌతాయి కొందరికి కొద్దిరోజుల పాటు అప్పుడప్పుడూ కళ్ళు తిరగటం, ఒళ్ళు తిప్పటం వంటి భావన కల్గవచ్చు. దీనికి కారణం; సిగరెట్ కాలుస్తున్నపుడు ఊపిరితిత్తుల్లోకి నికొటైన్ పొగ ఎక్కువ ప్రవేశిస్తుండేది. మరి సిగరెట్ కాల్చటం మానేయటంతో ఊపిరితిత్తులు ప్రాణవాయువుని, అధికంగా నింపుకోవటం జరుగుతుంది. అకస్మాత్తుగా జరిగే ఈ మార్పుకు శరీర తత్వం అలవాటు పడేంతవరకూ పై చెప్పిన ఇబ్బందులు ఎదురవటం సహజమే. లేదు. కళ్ళు తిరిగినట్లనిపించినా, ఏకారంగా వున్నా కొద్దినిముషాలు విశ్రాంతిగా సోఫాలో నో, కుర్చీలోనో వెనకకు చేరగిలబడి కూర్చోండి. అంతకైతే ఓ నిమ్మకాయ వాసన చూడండి.

* సిగరెట్ మానటంవలన కొందరికి తలనొప్పి రావటం కద్దు. అటువంటప్పుడు చల్లటి నీళ్ళతో ముఖం కడుక్కొని విశ్రాంతి తీసుకోండి. బాధ అధికంగా వుంటే తప్ప ఆస్ప్రిన్ మాత్రలు తీసుకోవద్దు.

* సిగరెట్లు మానివేయటంవల్ల కొందరికి నోటిరుచి చెడవచ్చు. కొందరు నోటి పూతతో బాధపడవచ్చు. రెండు మూడు రోజులు అలాగే అనిపించి అనంతరం పూతా మాయమౌతుంది; కాబట్టి ఈ విషయంలో భయపడాల్సిన అవసరం లేదు. అంతకైతే యాలుకగింజల్ని పాలమీగడలో కలిపి పుక్కిలి పట్టండి.

సిగరెట్ మానటానికి ఇన్ని చిట్కాలతో బాటు ఈ చిట్కాల్లోని ఓ చిన్న చిట్కా కొన్ని విధాల ఉపయోగపడుతుంది. సిగరెట్ పైకి మనసు మళ్ళినప్పుడల్లా బ్రీతింగ్ అభ్యాసాల్ని అమలుపరచండి. అంటే గుండెల నిండుగా గాలి నింపుకొనటం మెల్లగా గాలిని వదలటం ... ఇందువలన సిగరెట్ ధ్యాస మరవటమే గాక శరీరానికిగూడా వ్యాయామం లభిస్తుంది. మీరు సిగరెట్ మానివేయటం సులభమవుతుంది.

ఏదీ ఆచరించి చూడండి....

※

ఇతరుల డబ్బుతో సిగరెట్ కాల్చటంలో వుండే ఆనందాన్ని మించిందేం లేదు.

—రాజ్ బాబు.

ఏడేళ్ళప్పుడు పొగలోని మజా తెలుసుకుందామని ఎంగిలి పీకల కోసం పడిగాపులు కాసే వాడ్ని.

—పద్మనాభం.









సిగరెట్లు కాల్చటం మంచిదని ఎవరంటారు? సిగరెట్ మానటం అన్ని విధాలా మంచిది. Wish you good luck.

—ప్రత్యగాత్మ.

"ఓరి సన్నాసుల్లారా, బీడీలు తాగితే తాగి చచ్చారు గాని ఇన్ని మీగడ కొట్టారి బొండాం నీళ్ళు, అంత మజ్జిగన్నం తిని ఏడవండి ..."

—సల్లరామ్మూర్తి.




# క్లీర్‌టోన్ - సాటిలేని విద్యుత్ ఉపకరణాలు

'క్లీర్‌టోన్' రకరకాల విద్యుత్ ఉపకరణాలకు పెట్టింది పేరు. నాణ్యమైన ఈ ఉపకరణాల వెనుక, ఏళ్ళ తరబడి సాధించిన తయారీ అనుభవం ఉన్నది. అందుకే దేశమంతటా వేల కొద్దీ గృహిణులు 'క్లీర్‌టోన్' ఉపకరణాలనే వాడుతున్నారు.
మీ సొమ్ముకు తగ్గ విలువగల వస్తువులు కావాలంటే, 'క్లీర్‌టోన్' విద్యుత్ ఉపకరణాలనే కొనండి. ఈ ఉపకరణాల సర్వీస్ కొరకు దేశమంతటా 1,600 కు పైగా క్లీర్‌టోన్ డీలర్లు విస్తరించి ఉన్నారు.




నేషనల్ రేడియో & ఎలెక్ట్రానిక్స్ కంపెనీ. లిమిటెడ్ (జనరల్ రేడియో & అప్లయన్సెస్ డివిజన్) శాఖలు . ఢిల్లీ, కలకత్తా, మద్రాస్

# పదబంధ ప్రహేళిక

**శ్రీ-శ్రీ**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | | 3 | 4 | | 5 |
| | | 6 | 7 | | 8 | | | |
| 9 | 10 | | 11 | 12 | | | 13 | |
| 14 | | 15 | | | | 16 | | |
| | | 17 | | | | | | |
| | 18 | | | | | 19 | 20 | 21 |
| 22 | | | 23 | | 24 | | 25 | |
| | | 26 | | | 27 | 28 | | |
| 29 | | | | | | 30 | | |

## ఆ ధా ర ము లు

### అడ్డము

1. కథారంభం
3 కెమికల్
6 స్నో
8. ——సేవి
9. వాహన విశేషం
11. సినీ తార
13. గతి
14. తిరగబడ్డ జనం
16. కబళం
17. రాగం
18. ఒక రకం నైవేద్యం
19. శాంతి చిహ్నం
22. 3 విలువ
24. చెబితే వినాలి
25. నేపథ్య గాయకుడు
26. అయిదో వాడు
27. కార్యం వెనకబడింది
29. శాశ్వతమా?
30. శుభకార్యాలకి

నిలువు

1. శరీర భాగం
2. భక్ష్యం
3. తొడుగు (స్త్రీలకు మాత్రం)
4. పర్యాయం
5. ఇంటి పేరు (గేయ కవిది)
7. పైనే తమదే
10. అస్వస్థత
12. జ్వాలాముఖి
13. దురాక్రమణ?
15. ఒక సినీమా
16. ఉదాహరణలో వుంది
18. ఉదాహరణకి ఆస్ట్రేలియా
20. దయ చెయ్యరా
21. ఊరు పేరు
22. — పర్వతం
23. అబద్ధాలా?
24. సమూహం
26. పాలిచ్చేది
27. కృష్ణ శాస్త్రీయం (పొడి అక్షరాలు)

ప్రతి నెల 15 వ తేదీ లోగా పూరించిన పజిలు మాకు పంపవలయును.
ఆల్ కరెక్టు వాళ్ళకు ఒక 'జ్యోతి'ని బహుమతిగా ఇవ్వగలం.

## సెప్టెంబరు నెల పజిల్ క్లూ

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | 1 భూ | | 2 శి | నో | 3 బా | | 4 మి | |
| 5 గో | దా | 6 వ | రి | | 7 వ | 8 వెం | గి | రి |
| | 9 స | క్క | | 10 భా | | 11 డి | లౌ | |
| 12 మే | ము | | 13 కా | వే | 14 రి | | 15 ది | 16 శి |
| ఖి | | 17 బో | ను | | 18 ప్రి | వి | | న |
| 19 లి | 20 వే | | 21 కే | 22 లై | లు | | 23 చే | త్రి |
| | 24 రూ | 25 పా | | క్క | | 26 క | వ | |
| 27 త్రి | ధి | ప | 28 శి | | 29 బొ | మ్మ | రి | ల్లు |
| | ని | | 30 ఖో | గు | ట్టు | | కి | |

# ఆల్ కరెక్ట్

(1) కె. కె. ప్రసాద్, సికింద్రాబాద్. (2) కె. భానుమూర్తి, హైద్రాబాద్. (3) కె. వి. యం. హెచ్. డి. ప్రసాద్‌రావు, హైద్రాబాద్. (4) టి. వి. సుబ్బారావు, బొంబాయి. (5) అణ్ణాజి బసప్ప, హైద్రాబాద్. (6) జి. అప్పారావు, హైద్రాబాద్. (7) వి. విజయలక్ష్మి, తిరుపతి. (8) భట్టారం ఉదయిని, కావలి. (9) కె. బాలభారతి, హైద్రాబాద్. (10) జి. భానుమూర్తి, హైద్రాబాద్. (11) బి. శివ, హైద్రాబాద్. (12) వల్లూరి విజయకుమార్, మద్రాసు. (13) ఆ. పద్మావతి, విశాఖపట్నం. (14) రామవరపు జగన్మోహనరావు, విశాఖపట్నం. (15) కటకం సాంబశివరావు, హైద్రాబాద్. (16) ఎస్. శ్రీనాథ్, సికింద్రాబాద్. (17) పి. యస్. ఆర్. మూర్తి, హైద్రాబాద్. (18) ఒ. రమణామూర్తి, మద్రాసు. 19. డి. ఆళ్వార్‌స్వామి, వైవేలి. (20) కె. లక్ష్మణరావు, మద్రాసు. (21) పి. జె. ప్రసాద్, గుంటూరు. (22) వి. సీతామూర్తి, అనంతపూర్. (23) ఆకొండి సోదరులు, పిఠాపురం. (24) డా॥ కె. శివభూషణం, కె. జి. జయరామిరెడ్డి, కర్నూలు. (25) వి. రాజ్యశ్రీ, వరంగల్. (26) పి. అరుణాపార్వతీశం, కశిగిరి. (27) ఆరాధ్యుల శ్రీనివాసమూర్తి, చెన్నూరు. (28) వి. రాధాకిషన్‌రావు, హైద్రాబాద్. (29) డి. యస్. ఆర్. లక్ష్మి, మాచర్ల. (30) కె. నాగేశ్వరరావు, కర్నూలు. (31) డి. వి. రాఘవరావు, చోడవరం. (32) శ్రీమతి సరస్వతిభాను ప్రకాష్, హైద్రాబాద్. (33) గొడవర్తి నాగేశ్వరరావు, మద్రాసు. (34) శ్రీపాద శ్రీహరి, సికింద్రాబాద్. (35) వి. సత్యనారాయణమూర్తి, గున్నపూడి. (36) పి. కాజామియా, తాండ్రపాడు. (37) పి. రఘుకుమారి, మద్రాసు. (38) ఎం. శ్యామల, కర్నూలు. 39. నివర్తి రామచంద్రశేఖర శాస్త్రి, విజయవాడ. (40) పి. సీతారత్నం, నర్సాపూర్. (41) జి. నాగభూషణరావు, అనకాపల్లి. (42) ఎస్. రామకృష్ణ, విజయనగరం. (43) పి. సీతారామయ్య, విజయవాడ. (44) డి ఎ. రాజు, హైద్రాబాద్. (45) కె. వి. యం. కృష్ణమూర్తి, తిరుపతి. (46) జి. లక్ష్మి, హైద్రాబాద్. (47) ఎం. శ్రీనివాసరావు, విశాఖపట్నం. (48) తూభాటి నాగభూషణరావు, చిలకలూరిపేట. (49) పి. వి. జి. కృష్ణ, గుడ్లవల్లేరు. 50 పి. ఆర్. రావు, విశాఖపట్నం. (51) జె. వి. యల్. యన్. శాస్త్రి, తిరుచిరాపల్లి. (52) ఎ. వి. సుబ్రహ్మణ్యం-డబ్ల్యు. బి. రాధ, కర్నూలు. (53) ఎ. శేషగిరిరావు, బళ్ళారి. (54) కె. రామారావు, హైద్రాబాద్. (55) వికాసం, బరంపురం (56) వి. రాజబాపయ్య, విజయవాడ. (57) యు. సీతాపతిశర్మ-డబ్ల్యు, రాజారాం, రాజమండ్రి. (58) పాలపర్తి ఎస్. రావు, హైద్రాబాద్. (59) లక్ష్మిరావ్, మద్రాసు.

## ఒక తప్పు

(1) పి. యస్. శేఖర్, గుంటూరు; (2) వల్లభనేని హనుమంతరావు, కొత్తపట్నం; (3) లక్షణ్ బేగ్, గుంటూరు; (4) మునగపాటి సుగుణాదేవి హైద్రాబాద్; (5) కె. రామలక్ష్మి, మద్రాసు-నందనం; (6) కె. బుజ్జమ్మ, జంపని




ఆదర్శ సోదరులు నిర్మాత దర్శకుడు

# శ్రీ ప్రభాకర్ శ్రీ బాబూరావు

కొందరి కలలు నిజమవుతాయంటారు.

కానీ, స్వప్న లోకాల్లో విహరించక, క్రమశిక్షణతో, ఉత్సాహంతో తాము నిర్వహిస్తున్న కార్యభారం—వారి జీవితానికి మార్గదర్శి కాగలిగితే—మానవుని సంతోషానికి అవధులుండవు.



శ్రీ ప్రభాకర్

అదే జరిగింది. కాకినాడ సోదరద్వయం విషయంలో రామవిజేతా ఫిలింస్ నిర్మాత శ్రీ ప్రభాకర్, యువదర్శకులు శ్రీ బాబురావు గార్ల జీవితంలో.

ఈ నాడు ఒకరు నిర్మాత. మరొకరు కాలేజిలో చదువుకుంటున్న రోజుల్లో వీరు నాటకాలు వేసేవారు, శ్రీ ప్రభాకర్ నాటక నిర్మాత. దర్శకత్వభారం శ్రీ బాబురావు వహించేవారు. అదే విధంగా ఈ నాడు వా రిరువురు నిర్మాత, దర్శకులుగా యావదాంధ్ర లోకంలో పే రెన్నికగన్నారు. అయితే, వారు యిలా జరుగుతుందని, జరగాలని కలలు కనలేదు, ఊహించనూలేదు, సోదరులిద్దరూ ఇంటర్మీడియట్ వరకు చదువుకున్నారు, శ్రీ ప్రభాకర్ ఆర్టు డిప్లోమాకూడా పొందారు. శ్రీ బాబురావు తీసిపోలేదు, 1954 సంవత్సరంలో ఆంధ్రా యూనివర్సిటీలో బెస్టు ఏక్టర్‌గా ఎన్నికయ్యాడు. ఈ సందర్భం

లోనే శ్రీ డి. యల్. నిర్మిస్తున్న 'కన్యా శుల్కం'లో వెంకటేశం పాత్ర ధరించేందుకు పిలిపించారు శ్రీ బాబురావును. కానీ కొన్ని కారణాలవలన ఆ పాత్ర వేరేవారు వేయటం, ఈయన కాకినాడ తిరిగి వెళ్ళిపోవటం జరిగింది.

నిరుత్సాహంతో బాటు పట్టుదల పెరిగింది, శ్రీ బాబురావులో. తిరిగి మద్రాసు ప్రయాణం కటాడు. అప్పుడు 'భలే అమ్మాయిలు' నిర్మిస్తువ శ్రీ వేదాంతం రాఘవయ్యవద్ద అసిస్టెంట్ డైరెక్టరుగా చేశారు. అక్కడ కొంత అనుభవం గడించారు. ఆ తర్వాత విజయా వారు నిర్మించిన 'జగదేక వీరుని కథ' మొదలు 1967 సం॥వరకు అసోసియేట్ డైరెక్టరుగా శ్రీ కె. వి. రెడ్డివద్ద పనిచేసి, ఎన్నో మెళుకువలు తెలుసుకున్నారు.

"అనుకొన్న షెడ్యూల్ ప్రకారం ఆర్టిస్టులు సెట్‌కు రాకపోతే నేను కంగారు పడను. ఉన్నవారితో సరిపెట్టుకోగల శక్తి సామర్థ్యాలు మా గురువుగారైన శ్రీ కె.వి. రెడ్డిగారు నేర్పారు." తన అనుభవాన్ని గురించి మాట్లాడుతూ అన్నాడు శ్రీ బాబురావు.

పరిపక్వతకు ప్రత్యక్ష సాక్ష్యం అతని ధైర్యం!

శ్రీ బాబూరావు ఇక్కడ పనిచేస్తున్న రోజుల్లో సోదరుడు శ్రీ ప్రభాకర్ తమ్ముడి బాగోగులు చూచేందుకు వచ్చి శ్రీ గోఖలే దగ్గర అసిస్టెంటుగా చేరటం జరిగింది. 'తిమ్మరుసు [illegible] నీయం' 'పల్నాటి యుద్ధం' [illegible]కు సహాయ కళాదర్శకునిగా పనిచేశాడు

తమ్ముడి దినదినాభివృద్ధి చూపి తమ తల్లితండ్రులైన శ్రీ కొయిలాడ అప్పారావుగారు, శ్రీమతి నాగరత్నమ్మగార్లను ఒప్పించి, చిత్ర నిర్మాణానికి పూనుకున్నారు శ్రీ ప్రభాకర్.

నిర్మాతగా శ్రీ ప్రభాకర్, దర్శకునిగా శ్రీ బాబురావు నిర్మించిన వారి తొలి చిత్రం 'జరిగిన కథ' జనాదరణ పొందింది. శ్రీ కొయిలాడ అప్పారావుగారు కాకినాడలో ప్రముఖ వ్యాపారస్తులు కాలక్రమేణా మద్రాసులో స్థిరపడిపోవటం, చిత్ర నిర్మాణమే సోదరుల



శ్రీ బాబూరావు



'రామాలయం'లో జమున, జగ్గయ్య, చంద్రమోహన్, రోజారమణి, శోభన్‌బాబు, విజయనిర్మల.

---

ధ్యేయంగా మారటం ఆ తర్వాత 'తల్లి తండ్రులు', ననతమ్మ (కన్నడం) చిత్రాలను నిర్మించి దిగ్విజయం చేశారు. ఆ ఉత్సాహంతోనే మరో క్రొత్త తరహా కథ 'రామాలయం' పేరిట చిత్రీకరణ చేస్తున్నారు. చిత్రం దాదాపు పూర్తి కావచ్చింది.

రామాలయం' క్రొత్త పోకడలతో నిండిన కథే. ప్రతి మానవునియొక్క హృదయాలయంలోని మంచి చెడులను విశదీకరించే విశిష్టచిత్రం 'రామాలయం'. ప్రతివారు చూచితీరవలసిన చిత్రం,

ముఖ్య పాత్రలలో జగ్గయ్య, జమున శోభన్‌బాబు, విజయనిర్మల, ప్రభాకర రెడ్డి, రాజబాబు. చంద్రమోహన్, అల్లు రామలింగయ్య, రమణారెడ్డి, బాలకృష్ణ. సీతారాం. లకనం, రామ్‌చంద్‌, బి. ఎన్. ఆర్. సూర్యకాంతం, పుష్పకుమారి, కుమారి రోజా రమణి నటిస్తున్నారు.

మాటలు: పినిశెట్టి, సంగీతం। ఘంటసాల; పాటలు: ఆరుద్ర, దాశరథి. సి. నారాయణరెడ్డి, కొసరాజు; కెమెరా: మాధవ బుల్‌బుల్.

కథ: స్క్రీన్ ప్లే, డైరెక్షన్: కె. బాబూరావు, నిర్మాత: కె. ప్రభాకర్.



రామాలయం సెట్‌లో దర్శక నిర్మాత సంకేతిక నిపుణులు

## నూతన చిత్ర సంస్థ
## నవత చిత్ర

ఛాయాచిత్రవారి మంచి మనిషి ద్వారా చిత్రరంగంలో ప్రవేశించిన శ్రీ ఎన్. కృష్ణంరాజు నవతచిత్ర బ్యానర్ క్రింద ఒక చక్కటి సాంఘిక చిత్రాన్ని నిర్మిస్తున్నారు. దీనికి దర్శకత్వం శ్రీ సంగీతం శ్రీనివాసరావు: రచన శ్రీ డి. వి. నరస రాజు. త్వరలో నటీనటులను ఎన్నిక చేసుకుని సెట్టపైకి వెళ్లబోతున్నారు.

## 'దేవాంతకులు'

ఇంతవరకు కనీవినీ ఎరుగని రీతిలో సరికొత్త పంథాలో కామెడీ క్రైమ్ థ్రిల్లర్ చిత్రంగా 'దేవాంతకులు' చిత్రాన్ని రేఖా అండ్ మురళీ ప్రొడక్షన్స్ పతాకంక్రింద రూపొందించుటకు నిర్మాత డి. పురుషోత్తం సర్వ సన్నాహాలు చక చకా సాగిస్తున్నారు. పద్మనాభం, రాజ బాబు, గీతాంజలి, అంజలీదేవి మున్నగు తారలతో ఈ అక్టోబరు మాసంలో సెట్ మీద వెళ్ళనున్న ఈ దేవాంతకులు: చిత్రానికి దర్శకుడు: శ్రీ పద్మనాభం, రచయిత. శ్రీ అప్పలాచార్య. పేపరువర్కు పూర్తి చేశారు. సంగీతం: కోదండపాణి.

## చెల్లెలి కాపురం

చెల్లెలిపై అన్నయ్యకు గల అను



చిట్టితల్లి ఔట్‌డోర్ షూటింగులో జి. కె. మూర్తి, భారతి.

రాగాన్ని ఇతివృత్తంగాతీసుకొని ఆంధ్రుల అభిమాన నటుడు శ్రీ బాలయ్య రూపొందించిన కథయే 'చెల్లెలి కాపురం' చిత్రం, అమృతా ఫిలింస్ పతాకంక్రింద మనోహరంగా తయారైన ఈ చిత్రాన్ని శ్రీ ఫిలింస్‌వారు అతిత్వరలోనే విశాలాంధ్ర అంతటా విడుదల చేయనున్నారు, నల్లని వాడుగా. భావకవిగా, అమృత హృదయుడుగా శ్రీ శోభన్‌బాబు రాముపాత్రను అపూర్వంగా నటించిన ఈ చిత్రంలో రాధగా వాణిశ్రీ. రాము చెల్లెలుగా మణిమాల, శ్రీరామ్‌గా నాగభూషణం; అల్లు రామలింగయ్య. కె, వి. చల, ఛాయాదేవి, సత్యనారాయణ, మీనాకుమారి సంధ్యారాణి. రాజ్యలక్ష్మి మున్నగు తారలందరూ నటించారు.

శ్రీ ఎం. బాలయ్య సమర్పించు ఈ చిత్రానికి శ్రీ కె. విశ్వనాథ్ దర్శకత్వం వహించారు. శ్రీ గొల్లపూడి సంభాషణలు రచించారు కె. వి. మహాదేవన్ సంగీతం సమకూర్చారు, ఛాయాగ్రహణం: ఎస్. ఎస్. లాల్; ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్: కె. జయరామ్; ప్రెస్ రిలేషన్: శ్రీ కృష్ణ: నిర్మాతలు। ఏ. సూర్యనారాయణ, వి. కృష్ణస్వామి.

## శ్రీకాంత్ అండ్ శ్రీకాంత్

## షూటింగ్ ప్రారంభం

మనిషి మనుగడకు మనసు ముఖ్యం. ఆ మనసుకు మమతయే ప్రాణం. అన్న నగ్నసత్యాన్ని ఆధారంగా చేసికొని శ్రీకాంత్ అండ్ శ్రీకాంత్ వారు నిర్మిస్తున్న నవ నవోన్మేషణమైన సాంఘిక చిత్రానికి యిటీవలనే సత్యా స్టూడియోలో ముహూర్తం జరిగింది. శ్రీ సుందర్‌లాల్ నహతా ముఖ్య అతిధిగా విచ్చేశారు. చిరంజీవి శ్రీకాంత్ నహతా కెమెరా స్విచ్ ఆన్ చేశారు. మొదటి 'షాట్'లో శారద, హరనాధ్ పాల్గొన్నారు.

ఇంతవరకు ఎన్నో విజయవంతమైన కన్నడ చిత్రాలను, ఒకే ఒక తెలుగు చిత్రం 'సతీ అనసూయ'ను నిర్మించిన శ్రీకాంత్ అండ్ శ్రీకాంత్ సంస్థకు యిది పదో చిత్రం. బొల్లిముంత శివరామకృష్ణ రచనతో, డాక్టర్ నారాయణరెడ్డి కవితా స్రవంతితో, యం. రంగారావు సంగీత ప్రతిభతో, అశోక్‌కుమార్ కెమెరా పనితనంతో, చలం కళా దర్శకత్వంతో, ఎస్. పి. ఎస్. కృష్ణ ఎడిటింగ్‌తో సర్వాంగసుందరంగా తయారవుతోన్న యీ చిత్రానికి దర్శకులు: శ్రీ వి. రామచంద్రరావు. నిర్మాతలు: శ్రీకాంత్ నహతా అండ్, శ్రీకాంత్ పటేల్. నిర్వహణ: రామ్‌దొరై.



మయూర్ మూవీస్ 'జేమ్స్ బాండ్స్ 777'లో జ్యోతిలక్ష్మి.

శారద, హరనాధ్, గుమ్మడి, రాజనాల, జ్యోతిలక్ష్మి, విజయశ్రీ, విజయ రాధిక, సాక్షి రంగారావు ప్రభృతులు.



'జాతకరత్న మిడతంభొట్లు'లో ఒక చక్కని సన్నివేశం.

అతిథి తారలు: రాజబాబు, అంజలీదేవి తారాగణం.

శ్రీ మధుభాయ్ పటేల్ నిర్మాణ నైపుణ్యంతో, చక్కని ప్లానింగ్‌తో రూపొందే యీ చిత్రం డిసెంబరు విడుదల.

## ఆంధ్ర ప్రదేశ్‌కు జేమ్సుబాండ్ రాక!

జేమ్సుబాండ్ పేరు చెప్పగానే కత్తిలా దూసుకుపోయే కుర్రాడు, అతని చుట్టూ అందమైన ఆడపిల్లలు, అడుగడుగునా రివాల్వర్ ప్రేలుళ్ళు, భయంకరమైన పోరాటాలు, విచిత్రమైన ట్రిక్కులు గుర్తుకొస్తాయి. మధ్య-మధ్యన సరస సల్లాపాలు, అర్ధనగ్నంగా కేళీ విలాసాలు.... ఇంకా యిలాంటివి ఎన్నెన్నో మన మదిలో మెదులుతుంటాయి.

ఈ అనుభూతులను, ఆనందాలను తెలుగు రసికులతో పంచుకొనేందుకు సరిగ్గా అలాంటి జేమ్సుబాండ్ అతిత్వరలో ఆంధ్రప్రదేశ్‌కు వస్తున్నాడు. మయూర్ మూవీస్ వారు పిలిపిస్తున్న యీ జేమ్సు బాండ్ 777'' సెప్టెంబరు మాసాంతానికి, లేదా అక్టోబరు తొలి వారంలో ఆంధ్ర మహాశయులను కలుసుకొంటాడు.



అమృతా ఫిలింస్ "చెల్లెలి కాపురం"లో శోభన్‌బాబు నాగభూషణం.

హుషారయిన గూఢచారి నటుడు కృష్ణ రూపంలో వస్తున్న యీ "జేమ్సుబాండ్ 777"తో పాటు విజయలలిత, జ్యోతి లక్ష్మి, విజయశ్రీ, ఛాయాదేవి, రాజబాబు, సత్యనారాయణ, త్యాగరాజు, ముక్కామల, యింకా ఎందరో వస్తున్నారు. వీరిలో కొందరు అసలు వేషాల్లోను, కొందరు రకరకాల మారువేషాల్లోను వచ్చి తెలుగు వారికి నిండైన, మెండైన వినోదం చేకూరుస్తారు.

ఈ "జేమ్సుబాండ్ 777" బృందానికి సారధి శ్రీ కె. యస్. ఆర్. దాసు ప్రముఖ వాణిజ్య వేత్తలు శ్రీయుతులు బిక్కులాల్ అగర్వాల్, జి. వి. గుప్త నాగేంద్రనాయుడు గారలు ప్రత్యేకమైన కృషితో యీ "జేమ్సుబాండ్ 777" పర్యటన రూపొందిస్తున్నారు.

## కొరడా రాణి

నవ దర్శకులు శ్రీ కె. యస్. రెడ్డి, కె. యస్. ఆర్. పిక్చర్స్ పతాకం క్రింద నిర్మిస్తున్న చక్కని సెంటిమెంటల్ క్రైం థ్రిల్లర్ "కొరడా రాణి" మొదటి రెండు షెడ్యూల్స్‌లో నాలుగు రీళ్ళు చిత్రం పూర్తి అయింది.

జరగబోయే మూడవ షెడ్యూల్‌లో ప్రముఖ నర్తకిపై చిత్రీకరించేందుకు—



సత్యాచిత్ర వారి "తాసిల్దారుగారి అమ్మాయి"లో పుష్పకుమారి చంద్రకళ, జమున, సాక్షి రంగారావు, శోభన్‌బాబు.

---

శ్రీ పీటూరి సాహిత్యంతో ప్రముఖ సంగీత దర్శకులు శ్రీ సత్యం మధురమైన స్వర సమ్మేళనతో ఒక పాట ఆస్తు 16 వ. రికార్డు చేశారు

ఆంధ్ర ప్రేక్షకుల అభిమాన తార జ్యోతిలక్ష్మి ప్రథమంగా, కథానాయిక "కొరడా రాణి" పాత్రలో ప్రేక్షకుల హృదయాలను దోచుకోబోతూంది.

శరవేగంతో నిర్మింపబడుతున్న యీ చిత్రంలో రామకృష్ణ, రాజబాబు, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, త్యాగరాజు, రామదాసు, రమాప్రభ, శకుంతల మొదలైన వారు ముఖ్యభూమికలు నిర్వహిస్తున్నారు. అతిథి నటులు: దేవిక, బాలయ్య, ముక్కామల.

మాటలు: కృష్ణమోహన్, కెమెరా: దేవరాజ్, సంగీతం: సత్యం, ఎడిటింగ్, కందస్వామి, ఆర్ట్: బి. యస్. కృష్ణ.




బ్రహ్మానందరెడ్డిగారు ముఖ్యమంత్రి పదవికి రాజీనామా చెయ్యడంతో ప్రస్తుతానికి తెలంగాణా ఉద్యమం పూర్తి కావచ్చును.

అయితే, అనేక మంది ప్రాణాలు, ఆస్తులూ పోగొట్టుకున్నవారు తెలంగాణా వుద్యమంవల్ల ప్రజలకు మిగిలిందేమిటని ఎవరైనా అడిగితే తెలంగాణా ప్రాంతీయుడికి ముఖ్యమంత్రి పదవి అని చెప్పవలసి వుంటుంది.

తెలంగాణా ప్రాంతం ఆర్థికంగా వెనకబడి వున్న మాట నిజమే! ఆ మాట కొస్తే దేశంలో ఏ ప్రాంతం అభివృద్ధి చెందింది? విశాఖ, శ్రీకాకుళం జిల్లాలు మాటేమిటి? రాయలసీమ మాటేమిటి? గడచిన పాతికేళ్ళలోనూ హైద్రాబాదు మినహాయిస్తే ఆధునిక సౌకర్యాలతో కూడిన ఒక పెద్ద పట్టణమేదైనా రూపొందిందా? చదువుకున్న వారికందరికీ ఉద్యోగాలు లభిస్తున్నాయా? కాలేజీల్లో సీట్లు దొరుకుతున్నాయా? ఎన్.జీ.వో.ల జీతాలు జరుగుబాటుకు సరిపోతున్నాయా! అప్పుడూ ఇప్పుడూ కూడా ఉన్నవాడు తింటున్నాడు లేనివాడు లేదు. ఉన్నవాడు మరికొంచెం లేనివాడయాడు!

కాబట్టి తమ ఆర్థిక సమస్యలన్నిటికీ మూలకారణమేమిటో తెలుసుకునే వరకూ ప్రజలకు ఇలాంటి ప్రాంతీయోద్యమాల వల్ల ఫలితం వుండదు. వారు నాయకుల పదవీ రాజకీయాల్లో పావికలుగా వుపయోగ పడతం.

బ్రహ్మానందరెడ్డిగారు పదవీ విరమణవల్ల ఆయనకి నిరుద్యోగం వస్తుందనే భయంలేదు. కేంద్రమంత్రి వర్గంలో పదవి గాని కనీసం గవర్నరు పదవిగాని లభించవచ్చు. ఎందుకంటే ప్రజలకు ఉద్యోగాలు దొరకపోయినా యిబ్బంది లేదుగాని రాజకీయ నాయకులకు ఏదో ఉద్యోగం యివ్వలేక పోతే ప్రమాదం, ఏ ఉద్యోగం లేకుండా వుంటే వారూరుకుంటారా?

* * *

అమెరికన్ ప్రభుత్వం పాకిస్తాన్‌కు బహిరంగంగా ఆయుధాలు సప్లయి చేయడంవల్ల భారత దేశంలో అమెరికా అప్రతిష్ట పాలవుతున్నదనే విషయం గ్రహించి అమెరికానుంచి అనధికార ప్రతినిధులు. సెనేటర్లూ. మాజీరాయబారులూ ఒకరి తరువాతొకరు భారత దేశానికి వచ్చి బంగ్లాదేశ్ పట్ల, కాందిశీకుల పట్ల

సానుభూతి వెల్లడిస్తూ కన్నీళ్ళు కారుస్తూ న్నారు. మొన్ననే భారతదేశానికి మాజీ అమెరికన్ రాయబారి గాల్‌బ్రెత్ గారొచ్చి బంగ్లాదేశ్ మరొక వియత్నామ్‌గా మారకుండుగాక అనిదీవించారు. వియత్నామ్‌లో యుద్ధమెందుకొచ్చిందో ఎందుకింకా కొనసాగుతుందో మన మాజీ రాయబారిగారికి తెలీదంటారా? దక్షిణ వియత్నామ్ ప్రభుత్వం ప్రజాదారణ కోల్పోయినా దానికి ఆయుధాలిచ్చి, సైనికుల్ని పంపి అమెరికా అక్కడి యుద్ధాన్ని కొనసాగిస్తూంది. ఇప్పుడు బంగ్లాదేశ్‌లో పాకిస్తాన్‌కు పరువు మర్యాదలు లేకపోయినా అమెరికా యాహ్యాఖాన్ నియంతకి ఆయుధాలిస్తూంది. అమెరికన్ ఆయుధాలతో పాకిస్తాన్ సైన్యం బంగ్లాదేశ్‌లో మూక ఉమ్మడి హత్యలు సాగిస్తున్నా అక్కడి ఉద్యమం అడుగంటలేదు. పైగా పుంజుకుంటూ పాక్ సేనలమీద ముక్తి వాహినీ వీరులు దాడులు జరపడం తీవ్రం చేశారు. పల్లెసీమల్లో చాలా భాగాన్ని స్వాధీనం చేసుకున్నారు. వియత్నామ్‌లో లాగే యిక్కడ కూడా గెరిల్లా యుద్ధం చాలా కాలం పాటు కొనసాగేటట్టే కనిపిస్తూంది. పాక్ సైనికుల కాళ్లు చల్లబడితే అమెరికా తన సేనలను పంపుతుందా? అప్పుడు బంగ్లాదేశ్ కూడా పూర్తిగా వియత్నామ్‌లా మారవచ్చును. అందుకనే బంగ్లాదేశ్ ప్రభుత్వాన్ని భారతదేశం గుర్తిస్తేనేకాని యితర దేశాలు గుర్తించక పోవచ్చును.

ఇంతకీ చెప్పొచ్చేదేమంటే బంగ్లాదేశ్ సమస్య పరిష్కారం కాకపోవడానికీ, లక్షలకొద్ది శరణార్థులు భారతదేశంలోకి రావడానికి కారణం పాకిస్తాన్‌కి అమెరికా ఇస్తున్న యాహ్యాఖాన్ సైన్యం బంగ్లాదేశ్ ప్రజలను చంపడానికి ఆయుధాలిస్తూ అమెరికా యింకోవేపు శరణార్థుల విషయంలో కన్నీళ్ళు కారుస్తూ సహాయం అందిస్తూంది. ఒక పువ్వుకు సువాసనా దుర్వాసనా రెండూ వుంటాయా? ఈ రాజకీయాలు మనబోటి అజ్ఞానులకు అర్థం కావు

—కృష్ణవేణి.

---

"ఇక్కడ్నించి హోటల్ జరుపైళ్ళా? స్టేషన్ ఊరికి దగ్గరగా కట్టి ఉండకూడదా?"

"కాని రైల్వే లైను పక్కగా స్టేషన్ ఉండటం మంచిదని భావించి ఉంటారు!" అన్నాడు స్టేషన్ మాష్టర్.